# దేశాన్ని పునర్నిర్మించండి



శ్రీ వివేకానందస్వామి

# దేశాన్ని పునర్నిర్మించండి

స్వామి వివేకానంద



శ్రీ రా మ కృ ష్ణ మ ఠ ము

16, శ్రీరామకృష్ణ మఠం రోడ్డు,

మైలాపూరు : : మద్రాసు–600 004.

# ప్రకాశిక

మన భారతదేశం పునర్వికాసం సాధించడానికి, భారత ప్రజలు సార్థకమైన జీవితం గడిపి ఉన్నతిపొందడానికి అనువైన ఆలోచనా విధానాన్ని ప్రకటించారు వివేకానందస్వామి. ఈ నాటికి దేశాన్ని పట్టి పీడిస్తున్న అంటరానితనం నిరక్షరాస్యత మొదలయినవి ఎందుకు ఏర్పడ్డాయో తెలియజేస్తూ—వాటిని తొలగించడానికి తగిన మార్గాలను కూడా వివేకానందులు సూచించారు. బడుగు ప్రజల ఉద్ధరణ జరగకపోతే దేశానికి భవిష్యత్తు ఉండదని ఆయన హెచ్చరించారు. ఆ ఉద్ధరణకు ఆయన సూచించిన మార్గం—నేల విడిచిన సాము కాదు; అది—మానవులలో స్వార్థవృత్తిని ధర్శించాలనే సేవామార్గం

గత శతాబ్ది చివరి రోజుల్లో—ఆధునిక విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాల అభివృద్ధితో అలనాటి సాంఘిక వ్యవస్థ విచ్ఛిన్నం కాజొచ్చింది. బడుగు ప్రజలకు ప్రాధాన్యత హెచ్చనారంభించింది. అందుకుతోడు దేశమంతటా వివిధ మార్గాలను అనుసరించే సంస్కర్తలూ ఉండేవారు. వారి సంస్కరణలు ఎన్నో - సంఘాన్ని పీడిస్తున్న వ్యాధుల మూలాన్ని అరికట్టే బదులు, ఆ వ్యాధుల బాహ్యలక్షణాలను చికిత్స చేసేవిగా ఉండేవి. ఈ అన్నింటినీ దృష్టిలో ఉంచుకొని వివేకానందస్వామి వివిధ సందర్భాలలో, వివిధ ప్రాంతాలలో కర్తవ్యబోధచేశారు. వ్యక్తి దేశమూ ముందంజ వేయడానికి ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలు ఈనాటికీ సార్థకంగానే ఉన్నాయి.

దేశ పునర్వికాసాన్ని గురించి స్వామి వివేకానందులు తమ ఉపన్యాసాలలోనూ, గ్రంథాలలోనూ ప్రకటించిన వివిధ అభిప్రాయాలలో కొన్నిటిని ఎన్నిక చేసి, వాటిని ఐదు శీర్షికలకింద సమన్వయపరచి ఈ పుస్తకాన్ని రూపొందించాము. 'రిబిల్డ్ ఇండియా' (Rebuild India) అనే పేరిట ఆంగ్లంలో వెలువడిన ఈ పుస్తకాన్ని సరళమైన తెలుగులోకి అనువదించి యిచ్చిన శ్రీమతి తురగా జానకిరాణిగారికి మా ధన్యవాదాలు.

సంఘసేవా కార్యకర్తలకూ విద్యార్థి లోకానికీ ఈ పుస్తకం మంచి చేయూత కాగలదని మా విశ్వాసం.

—ప్రకాశకులు

# విషయ సూచిక

—:o:—

# ముందుమాట



స్వాతంత్ర్యం సిద్ధించిన నాటినుండి మన దేశ ప్రజలలో, ముఖ్యంగ మన నవయువకుల్లో, జాతిని పునర్నిర్మాణం చేయాలన్న ఉత్సాహం మెండుగా కలిగింది. ఇది చాల ప్రశంసనీయమైన సంగతి. అయితే, యీ పనికి ఎవరైనా పూనుకునే ముందు, భావి భారతదేశం ఎల్లా వుండవలెనన్నది స్పష్టంగా ఒక భావం ఏర్పరచుకుని వుండాలి. ~~చిత్రకారుడు ఒక~~ చిత్రాన్ని కాన్వాసు పైన గీసేందుకు ముందుగానే తాను ఏమి చిత్రించదలచుకున్నాడో ఆ స్వరూపాన్ని తన మనస్సులో స్పష్టంగా వూహించుకొని వుంటాడు. అల్లాగే ఇంజనీరు ఒక భవన నిర్మాణానికి పూనుకునే ముందు, ఆ భవంతి దేనికొరకు వినియోగించబడుతుంది- పాఠశాలకా, వైద్యశాలకా, ప్రభుత్వ కార్యాలయానికా, నివాసగృహానికా అనేఅంశాన్ని గురించి సంపూర్ణంగా భోగట్టా సేకరించుకుంటాడు. ఆ తర్వాత అతడు ఒక నమూనా గీచి, ఆ ప్రకారం కట్టడం సాగిస్తాడు. కాబట్టి, మనకు కూడా భావితరాన్ని గురించి ఒక నిర్దిష్టమైన చిత్రం దృష్టిలో వుండాలి. ఆ తర్వాతనే భారతజాతి- నిర్మాణానికి పూనుకోవాలి. మనం భారతదేశాన్ని ఒక గొప్ప సైనిక జాతిగా రూపుదిద్ద దలచుకొన్నామా? మనకు అల్లాంటి ఉద్దేశం లేదని నాకు ఖచ్చితంగా తెలుసును. ఎందుచేతనంటే ఏ సైనిక శక్తి కూడా చిరకాలం కొనసాగలేదు. హిట్లర్, ముస్సోలినీలకు పట్టిన దుర్గతి చూడండి.

మనది పేదదేశం, అశేషప్రజానీకానికి తిండి పెట్టేందుకు మనకు సంపత్తి కావాలి. కానీ కేవలం అన్నం వల్ల మన సమస్యలు తీరిపోతాయా? అమెరికా మొదలైన అభివృద్ధి చెందిన దేశాల్లో ఎంత సంపద వున్నప్పటికీ ఆ ప్రజలకు మనశ్శాంతి, నిజమైన ఆనందమూ వున్నాయా? వారికవి వున్నట్లు కనుపించడం లేదు. ఆ దేశాలలోని యువతనూ, అపారసంపదలకు వారసులైన బాలబాలికలను చూడండి. జీవితంలో సాధించేది ఏదీ లేదనే తీవ్ర అశాంతితో వారు ఎల్లా తిరగాడుతున్నారో! వారిలో చాలమంది చెప్పలేనంత ధనవంతులు. కానీ జీవితంలో లక్ష్యం లేనందువల్ల, ప్రయోజనరహితమైన శూన్యతాభావంతో బాధపడుతుంటారు. మనకి సైనిక శక్తి ఆత్మరక్షణ నిమిత్తం కావాలిగానీ. పొరుగువారిని కొల్లగొట్టడానికి కాదు. పేదప్రజానీకానికి ఆహారం సమకూర్చేందుకు సంపద కావాలి కానీ అదే మనజాతి ధ్యేయం కాజాలదు. ఈ రెండూ కాక మరింకేదో అవసరమున్నది. శక్తిసంపదలతోబాటుగా మనకు శాంతిని ప్రసాదించే అంశం ఏమిటి?

మన దేశ ప్రాచీనచరిత్రను పరికించి, అశోకుడు, చంద్రగుప్తుడు, కనిష్కుడు మొదలైనవారి కాలంలో మన యీ గొప్పదేశం శక్తిసంపన్నమై, సౌభాగ్యవంతమై, సుఖసౌఖ్యాలతో ఏవిధంగా అలరారిందో తెలిసికోవటం మంచిది. వేదయుగంలోను, బౌద్ధయుగంలోను మన దేశాన్ని మహిమాన్వితం చేయదగిన ఉన్నతాదర్శాలు మనకున్నాయి. అయితే యీ పతనం ఎల్లా సంభవించినది? మన అధఃపతనానికి గల కారణాలను మనం కనుగొనాలి. భావిభారత నిర్మాణం చేయ

వలెనంటే మనలను మహిమాన్వితులను చేసిన ఆదర్శాలను స్వీకరించి, అధఃపతన హేతువులైన అంశాలను త్రోసిపుచ్చి, ఆనాడు లేనటువంటి శాస్త్రీయ, సాంకేతిక లక్షణాలను ఒనగూర్చుకోవాలి.

మనం యీనాడు ప్రతిదానికీ వైజ్ఞానిక శాస్త్రాన్ని గురించి ప్రస్తావిస్తాము. ఒకానొకటి శాస్త్రీయము కాదనీ, మూఢవిశ్వాసమనీ అంటాము. కానీ మూడు వేల సంవత్సరాల కాలం మన నొక జాతిగ నిలబెట్టిన లక్షణాలేమిటో, వాటిలోని మంచి ఏమిటో తెలుసుకునే యత్నం చేయకపోవడం, మన గతాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేయడమూ శాస్త్రీయమేనా? కాలపరీక్షలను ఎదుర్కొన నటువంటివీ కేవలం రెండువందల సంవత్సరాలనాటివీ, అంతకన్న తక్కువ కాలానివీ అయినటువంటి పాశ్చాత్య భావాల వైపు పరుగులు దీయటం శాస్త్రీయమేనా? ఆ ఆదర్శాలు పాశ్చాత్యజాతుల సమస్యలన్నిటినీ తీర్చివేశాయా? వారు సుఖమూ శాంతీ పొందారా? వారు అవి పొందినట్లు తోచడం లేదు కాబట్టి ఆ ఆదర్శాల వెంటబడి పోవడం దేనికి?

మనం మానవులము భగవంతుడు మనకు తార్కిక జ్ఞానాన్నిచ్చాడు. ఎవరేనా వచ్చి ఏదో బలమైన వాదన ఒకటి చెప్పినంతలో వారి వెనుకబడి గొర్రెల్లాగు పోకుండా వుండడానికే యీ జ్ఞానాన్నిచ్చాడు. కాబట్టి మనం జరుగుతున్న, జరిగిపోయిన కాలాలకు సంబంధించిన విషయాలను, విశేషాలను అన్నిటినీ సేకరించి, చక్కగా ఆలోచించి, భవిష్యత్తుకు ప్రణాళికలు వేయాలని నేను భావిస్తున్నాను. ఆవేశంతో

అన్నిటికంటే అతి ముఖ్యమైనది శీలము. శీలం లేనిదే ఏ మహాకార్యమూ సాధ్యం కాదు. మహాత్మాగాంధీగారిని చూడండి. తన వ్యక్తిగత శీలమాహాత్మ్యంతో జాతిని వూపి వేసి, ఇంగ్లీషువారు భారతదేశాన్ని వదిలి పోవునట్లు ఆయన ఎల్లా చేయగలిగారో చూడండి. ఆయన తుపాకులు, అణు బాంబులు మొదలైనవి ఉపయోగించలేదు. కాబట్టి మన దేశాన్ని మహోన్నతంగా చేయవలెనంటే, ముందుగా మన శీలాన్ని పెంచుకోవాలి. వివేకాన్ని ఉపయోగించాలి. మనం ఏ మాదిరి జాతిని నిర్మించబోతున్నామనేది తెలిసికొని, దాని కోసం కృషి చేయడం ఆరంభించాలి. దీనికొరకు ప్రాణత్యాగం చేయవలసివచ్చినా వెనుదీయరాదు భారతీయ సంస్కృతి ఆదర్శాలలోని గొప్పతనం తెలిసికునేందుకు స్వామి వివేకానంద విరచిత గ్రంథాలు మనకు మార్గదర్శకాలుగా ఉపయోగించగలవ

స్వామీజీ రచనలనుండి కొన్ని భాగాలను సమీకరించి ప్రచురించిన యీ చిన్న సంకలనం మన దేశ పతనానికి, ప్రస్తుత పరిస్థితికి కారణాలు, పునరుజ్జీవనానికి మార్గాలు మొదలైన అంశాలపై వారి అభిప్రాయాలు ఎటువంటివో చెబుతుంది. నవభారత నిర్మాణము చేయబూనుకుంటున్న యువతకు యీ సంకలనం సాయపడగలదని ఆశిస్తున్నాను.

బేలూరు మఠం.<br>28 డిసెంబర్ 1980

స్వామి వీరేశ్వరానంద<br>అధ్యక్షులు<br>రామకృష్ణ మఠము, మిషను, బేలూరు.

## ప్రథమాధ్యాయం

# కుటీరాల్లో కాపురమున్న జాతి

మన పవిత్ర మాతృభూమి మతానికి, తత్త్వజ్ఞానానికి పేరుగన్నభూమి. మహోన్నత ఆత్మజ్ఞాన సంపన్నులను కన్న భూమి—సర్వసంగ పరిత్యాగానికి పుట్టినిల్లు. అలనాటినుండి ఆధునిక కాలం వరకు మానవ జీవితంలో ఆచరించదగిన మహోత్కృష్ట ఆదర్శాలను అందించిన ఏకైకభూమి యిదే!

ప్రతిజాతికీ ఒక ప్రధాన సిద్ధాంతముంటుంది. మిగిలిన వన్నీ ద్వితీయస్థానాన్నే ఆక్రమిస్తాయి భారతదేశానికి మూల ప్రాతిపదిక మతము, దైవభక్తి. సాంఘిక సంస్కరణ మొదలైనవన్నీ ఆ తరువాతనే ప్రాముఖ్యం వహిస్తాయి. మృత్యువు నివురులా కప్పివేస్తున్న మనజాతి జీవనాన్ని యిప్పటికీ లో లోపల రాజుకుంటోంది మనజాతికి ప్రాణం మతం, మనజాతి భాష, భావము, అన్నీ మతమే. మీ రాజకీయాలు, సాంఘిక కార్యక్రమాలు, పురపాలక సంఘాలు, ప్లేగు నిరోధక కార్యక్రమాలు, కరువు సహాయ పథకాలు—అన్నీ మతం ద్వారానే నిర్వహింపబడతాయి. మనదేశంలో ఎప్పటికీ యీ విధంగనే జరుగుతున్నది. అల్లా కాకపోతే, మీ ఉన్మత్త ప్రలాపాలు, రోదనలు నిరర్థకమై, వృథా. అయిపోతాయి మిత్రమా! దైవభక్తిని, మతాన్ని విసరికొట్టి పారవైచి, రాజకీయ, సాంఘిక కార్యక్రమాలుగానీ, యింక మరేదైనాగానీ ప్రధాన

కార్య కేంద్రంగా నీవు స్వీకరించినా, జాతి జీవన శక్తిగా స్వీకరించినా, నీవు సమూలంగా నాశనమైపోతావు!

ప్రపంచ చరిత్రను జాగ్రత్తగా పఠించినట్లయితే, ప్రకృతి ధర్మానుసారంగా ప్రతి సంఘంలో, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే చతుర్వర్ణాలు ఒకదాని తరువాత ఒకటి, వరుసగా ప్రపంచాన్ని ఏలినట్లుగా తెలుస్తుంది. జ్ఞానం, ధనం, ఆయుధాలు అనే సంపదలలో దేనినిగుత్తగొన్నవారి చేతుల్లో సాంఘిక నాయకత్వం వున్నప్పటికీ, వారందరి అధికారశక్తి కూడా పరిపాలితులైన ప్రజాబాహుళ్యం నుంచే ఉత్పన్నమైంది.

ఈ ప్రపంచంలో సాధించిన ప్రగతి కోసం తమ గుండె నెత్తురు చిమ్మిన వారిని ఎవరు తలచుకొంటారు, ప్రశంసిస్తారు? విశ్వవిజేతలైన ఆధ్యాత్మిక గురువులు, రణశూరులు, కవిశేఖరులు వెలుగురి దృక్కులలో పడి, మానవజాతి ప్రశంసలను అందుకొన్నారు. కానీ ఎవ్వరూ తొంగిచూడనటువంటి, ఎవ్వరూ మాటమాత్రం ప్రశంసించనటువంటి అందరూ ఏవగించుకొనేటువంటి పరిసరాల, పరిస్థితుల మధ్య, అంతులేని ఓర్మినీ, అనంతమైన అనురాగాన్నీ చెదరని ప్రయోజన దృష్టినీ ప్రదర్శిస్తూ, వీసమెత్తు విసువు లేకుండా రేయింబవళ్ళు తమ గృహాలలో కర్తవ్య నిర్వహణ చేస్తున్న సామాన్య ప్రజల సంగతేమిటి? అందులో ధైర్యశౌర్యాలు నిండిలేవా?

రైతు, చెప్పులు కుట్టేవాడు, వీధులను వూడ్చే మనిషి

విశ్వాసం, కార్యదక్షత వున్నాయి. యుగయుగాలుగా మౌనంగా, ఒక ఫిర్యాదుగా మాటకూడా అనకుండా దేశ సంపద యావత్తును ఉత్పత్తి చేస్తున్నారు. వారు మీవలె, కాసిని గ్రంథాలు చదవకపోతే మానె—దర్జీ కుట్టిన దుస్తుల వంటి మీ నాగరికతను పొందకపోతే మానె—వాటికి విలువ ఏమున్నది కనుక? అన్ని దేశాలలోను జాతికి వెన్నముక వారే. ఈ క్రింది తరగతుల వారుగానీ పనిచేయడం నిలిపి వేస్తే మీకు తిండి, బట్ట ఎక్కడనుంచి వస్తాయి? కలకత్తాలో వీధులు వూడ్చేవారు ఒక్కరోజు పనిమానివేస్తే పెద్ద బాధయి పోతుంది. వారు మూడు రోజులు సమ్మె చేస్తే అంటువ్యాధుల వల్ల మొత్తం జనాభా నగరాన్ని ఖాళీచేసి వెళ్ళిపోతారు. కూలీ జనం పనిచేయడం మానివేస్తే మీకు ఆహారవస్త్రాల సరఫరా ఆగిపోతుంది. మరి మీరు వారిని అధమజాతివారని అంటూ, మీ సంస్కారం గురించి డప్పుకొట్టి డంబాలు పలుకుతుంటారు!

ఈ సామాన్య ప్రజలు వేలాది సంవత్సరాలు పీడించ బడ్డారు, మూగగా హింసను భరించి, తత్కారణంగా అద్భుతమైన మనస్థైర్యాన్ని సంపాదించుకొన్నారు. వారనుభ వించిన అంతులేని బాధవల్ల వారికి జంకులేని సజీవ చైతన్యం అలవడింది. పిడికెడు అన్నం తిని బ్రతుకుతూ, వారు సకల ప్రపంచాన్ని గడగడలాడించగలరు. వారికి ఒక సగం రొట్టె పడేయండి, వారిలో ఉత్పన్నమయ్యే శక్తిని ప్రపంచం భరింప

బడింది. అంతేకాక, పవిత్రమైన నైతిక జీవితం గడుపు తుండడం వల్ల అత్యద్భుతమైన శక్తిని కలిగి వున్నారు. ఇది యీ లోకంలో మరెక్కడా కానరాదు. ఆ శాంతభావం, సంతృప్తి ప్రేమ, నిరంతర శ్రామికశక్తి, సమయం వచ్చి నప్పుడు సిరహాబల ప్రదర్శన-యివి మరెక్కడ గోచరిస్తాయి మీకు?

ఒక గొప్పకార్యాన్ని సాధించవలసి వచ్చినప్పుడు చాలమంది మహావీరులై పోతారు -అసంఖ్యాక జనం తనకు జేజేలు చెబుతారన్నప్పుడు పిరికివాడు కూడా తన ప్రాణాన్ని ధారపోస్తాడు, పరమస్వార్థపరుడు నిష్కామపద్ధతిలో ప్రవర్తి స్తాడు.-కానీ ఎవ్వరూ గుర్తించరని తెలిసిన అతిచిన్న కార్యాన్ని చేసేటప్పుడు కూడ అంతటి కార్యదీక్ష, నిస్వార్థత చూపితే వాడు నిజంగా ధన్యుడే! ఓ నిరంతర పీడిత కార్మికులారా, కర్షకులారా! సరిగ్గా మీరి దే చేస్తున్నారు మీకు నేను శిరసా నమస్కరిస్తున్నాను

మన ప్రజలకు ప్రాపంచిక విషయాల జ్ఞానం అంతగా లేదు పేదరికం యిక్కడ నేరంకాదు కాబట్టి మన ప్రజలు పరమ బుద్ధిమంతులు. హింసను ఎరుగనివారు. అమెరికా, ఇంగ్లాండు దేశాల్లో నా దుస్తులను బట్టి ఎన్నో సార్లు జనం నన్ను ముట్టడించారు. మన దేశంలో వింత వేషధారణ చేసిన వాడిని జనం ముట్టడించటమనేది నే నెన్నడూ వినలేదు. పాశ్చాత్య దేశాలలోని నిరుపేదలు రాక్షసులు. వారితో పోల్చి చూస్తే

ఉద్ధరించడం సులభసాధ్యం. యిరోపా దేశంలోని సామాన్య ప్రజానీకం కంటే మన భారతదేశస్థులు అన్నివిధాల అతి నాగరికులు మన ప్రజలు మూర్ఖులని, వారికి ఏ రకమైన విద్య వద్దనీ, ఏ విషయాన్ని గురించిన సమాచారం వారు పట్టించుకోరనీ అంటూండడం విన్నాను. నాకు కూడా ఆ అభిప్రాయంలో ఒక తెలివి తక్కువ ఏకీభావం వుండేది కానీ ప్రపంచ పర్యటన చేస్తూ, హడావిడిగా ఏదో ఒక పరిశీలన చేసి వ్రాసిన అనేక గ్రంథాలకంటే, అనేక ఊహాగానాలకంటే, ప్రత్యక్షానుభవం అతి గొప్ప విషయాలను దివ్యంగా నేర్పుతుందని గ్రహించుకొన్నాను. ఈ అనుభవం నాకు చెబుతోంది వారు మూర్ఖులు కారని. ఈ భూమిపైన వున్న ప్రతిజాతికీ వున్నపాటి జ్ఞానతృష్ణ వారికీ వుంది. అత్రుతా వుంది.

మత గ్రంథాలన్నిటిపైనా గుత్తాధిపత్యం వహించి ఏ విషయంలోనైనా అనుమతి, నిషేధం అనే వాటిని హస్తగతం చేసికొన్నవారు బ్రాహ్మణులు. ఇతరజాతులన్నీ నీచ, నికృష్టాలని పదేపదే ఉద్ఘాటిస్తూ, తాము నిజంగా అటువంటి వారమేననే భావాన్ని వారి మనస్సుల్లోనూ నాటి వేశారు. ఒక మనిషితోటి, "నీవు అధముడవు! నికృష్టుడవు" అని రేయి, పగలు కూడా విరామం లేకుండా అంటూవుంటే, కాలక్రమేణా అతడు తానటువంటివాడనే అని విశ్వసించక మానడు. దీనిని హిప్నాటిజం అంటారు.

కులానికి సంబంధించిన మీమాంసతో నాకు ఏ పక్షం-
గానూ అభిమానం లేదు. ఎందుచేతనంటే యిది గుణ, కర్మ

వైవిధ్యంపై ఆధారపడిన ఒక సాంఘిక ధర్మం అని నాకు తెలుసు.

కులం విషయమే తీసుకోండి. అది సంస్కృతంలో 'జాతి'. జాతి అనేదానికి మూలభావం ఒక వ్యక్తి తన ప్రకృతిని, స్వభావాన్ని వ్యక్తీకరించేందుకు స్వేచ్ఛ—అతని జాతియే అతని కులం ఇది యీ విధంగా వేలాది సంవత్సరాలనుండి ఉండిపోయినది

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగా వ్యక్తులను వర్గీకరించే సత్త్వరజస్తామా గుణాలలో ఏవో కొన్ని ప్రతివ్యక్తిలోను యించుమించుగా వుంటూనె వుంటాయి. కానీ ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క గుణం వివిధ పరిమాణాల్లో ప్రస్ఫుటమౌతూ వుంటుంది. వివిధ వృత్తి వ్యాసంగాలలో నిమగ్నమై వున్న మనిషిని చూడండి జీతం మీద ఎవరి దగ్గరనె నా కొలువున్నప్పుడు అతడు శూద్రత్వం'లో వుంటాడు. తనకోసంగా ఏదైనా వస్తువును లాభం మీద అమ్మే వ్యాపారం చేస్తున్నప్పుడు అతడు వైశ్యుడు. అన్యాయాలను చక్కదిద్దడానికి అతడు పోరాడుతోంటే, క్షత్రియుని లక్షణాలు అతనిలో బహిర్గతమౌతాయి. భగవద్ధ్యానంలో నిమగ్నమైనప్పుడు, భగవంతుని గురించిన భావనలు జరుపుతున్నప్పుడు అతడు బ్రాహ్మణుడై భాసిస్తాడు. సహజంగానే, ఒకవ్యక్తి ఒక కులంనుండి వేరొక కులం లోనికి మార్పుచెందవచ్చును. కాకపోయినట్లైతే విశ్వామిత్రుడు బ్రాహ్మణుడెలాగైనాడు. పరశురాముడు క్షత్రియుడెలా

గా నాడు? బ్రాహ్మణుని కుమారుడు సర్వదా బ్రాహ్మణుడే కానవసరంలేదు అతడు బ్రాహ్మణుడయ్యే అవకాశాలున్నప్పటికీ అత నావిధంగా కాకుండా పోవచ్చును.

వర్ణపద్ధతిన విభజించే యీ వ్యవస్థ నాగరికతను అందుకొనే సోపానం దీనివల్ల పాండిత్యాన్ని బట్టి, సంస్కృతినిబట్టి ప్రతివాడూ ఉన్నతికి రావడం జరుగుతుంది. యూరోప్ లో ఎప్పుడూ శక్తివంతుడు విజయశీలిగావడమూ, బలహీనుడు నాశనం కావడమూ జరుగుతుంది. కానీ భరతుని యీ భూమిలో ప్రతి సాంఘిక న్యాయమూ, బలహీనుల రక్షణార్థమే ఏర్పడినది.

వివిధ సంఘాలుగా ఏర్పడడమనేది సామాజిక ప్రవృత్తిలోనే వున్నది. అల్లా ఏర్పడడం వల్ల కొన్ని నాకర్యాలు వస్తాయి. కులమనేది ఒక సహజ పద్ధతి సాంఘిక జీవనంలో నే నొక విధి నిర్వర్తించవచ్చు. నీవు మరొకటే చేపట్టవచ్చు. నీవు దేశాన్ని రక్షిస్తూండవచ్చు. నేనొక జత పాత చెప్పుల్ని మరమ్మతు చేయగలిగే యుండవచ్చును. కానీ యీ కారణాన నీవు నాకంటే గొప్పవాడివి కాజాలవు. ఎందుచేతనంటే నా చెప్పులు నీవు కుట్టగలవా? .నీవు వేదాలను పఠించడంలో నిష్ణాతుడవై యుండవచ్చు. కానీ నా నెత్తిమీద ఎక్కి త్రొక్కడానికి అది కారణం కారాదు. హత్య చేసిన వాడిని ఎందుకని స్తుతించాలి ఒక ఆపిల్ పండు దొంగిలించిన వేరొకడిని ఎందుకు ఉరితీయాలి? ఇదంతా తొలగిపోవాలి. వాస్తవానికి వేదాంతం బోధిస్తే, "నేనూ నీ అంతటి మంచి

మనిషినే" అంటాడతను. నేనొక బెస్తవాడను. నీవొక తత్త్వవేత్తవు. కానీ నీలో వున్న భగవంతుడే నాలోనూ వున్నాడు. మనకు కావలసినది యిదే, ఎవరికీ ప్రత్యేక వసతులు వద్దు. అందరికీ సమానావకాశాలు. దైవం అంతరంగంలో వున్నాడనీ, ఎవరి మోక్షమార్గాన్ని వారు సాధించుకోవాలనీ అందరికీ నేర్పించాలి

ప్రాచీన భారత దేశంలో నలుగొందన యిద్దరు మహావ్యక్తులు కూడ క్షత్రియులే కానశం విశేషం—కృష్ణుడు, బుద్ధుడు. మరింత గొప్ప విశేషమేమిటంటె, ఈ భగవత్స్వరూపులిద్దరూ కూడా కులభేదమూ, స్త్రీ పురుష విభేదమూ, లేకుండా ప్రతి ఒక్కరికీ జ్ఞానద్వారాలను తెరచివేశారు.

వర్ణవ్యవస్థలో ఎప్పుడూ ఒక సౌలభ్యం వుండేది. ఆ సౌలభ్యమే మరీ మెత్తదనంగా పరిణమించి, సాంస్కృతికంగా అధమ స్థాయిలో వున్న జాతులు చక్కని ఉద్ధతిలో ఉచ్ఛస్థితికి చేరుకొనే ఏర్పాటు జరుగలేదు ఈవర్ణ వ్యవస్థ, సిద్ధాంత రీత్యా యావద్భారత దేశాన్ని ఒకే ఒక నేతృత్వం క్రింద ఉంచినది ఆ నేతృత్వం ధనప్రధానం కాదు ఖడ్గశక్తి ప్రధానం కాదు, మేధాసంపన్నుల ఆధిక్యం! ఆముష్మిక జ్ఞానం చేత అదుపు చేయబడి, పరిశుద్ధమైన మేధాశక్తి అది! ఇతర దేశాలన్నిటిలో అత్యధిక గౌరవం సాయుధపాణియైన క్షత్రియునికి దక్కుతుంది. కానీ భారత దేశంలో అత్యున్నతస్థానం శాంతి స్వరూపుడైన శర్మకు-బ్రాహ్మణునకు, భగవద్భక్తుడైన భాగవతోత్తమునికి—చెందుతుంది.

ప్రతి దేశంలోను ఆయా స్త్రీ పురుషుల వ్యక్తిత్వాన్ని బట్టి కులధర్మం నిర్ధారణమౌతుంది. వ్యక్తియొక్క సంపద, అధికారం, మేధాశక్తి, సౌందర్యం చాలు, ఆ వ్యక్తి తన జన్మగత ప్రతిపత్తిని వదలి తన శక్తిమేరకు పైపైకి చొచ్చుకొని పోవడానికి... నిమ్నకులం నుండి ఉన్నతకులానికి, అత్యున్నతి కులానికి అధిరోహించే అవకాశం యీ దేశంలోనూ వున్నది. కానీ పరహిత పరాయణత్వానికి జన్మభూమి యైనటువంటి యీ దేశంలో ప్రతివాడు తన కులాన్నంతటిని తీసికొని పోవలసివున్నది.

కులమనేది ఏమిటో లక్షలలో ఒక్కరికీ అర్థం కాదు. కులం లేని దేశం ప్రపంచంలో ఏదీ లేదు, మన దేశంలో మనం కుల వ్యవస్థనుండి కులరాహిత్యస్థాయి వరకు చేరుకొంటూంటాము—ఇదే సూత్రంపై—వర్ణవ్యవస్థ—సర్వదా ఆధారపడి వున్నది. ఆదర్శమానవతకు మారుపేరైన బ్రాహ్మణునిగా ప్రతి ఒక్కరినీ మార్చడమే మన ప్రణాళిక. భారత దేశ చరిత్రను చదివినట్లయితే, నిమ్నజాతులను ఉద్ధరించడానికే ఎప్పుడూ ప్రయత్నాలు జరిగాయని తెలుస్తుంది.

కులమనేది ఒక సాంఘికాచారం. మహనీయ మత గురువులందరూ దీన్ని ఛేదించడానికి ప్రయత్నించారు. బౌద్ధ మతంనాటినుండి, ప్రతి మతమూ కులానికి వ్యతిరేకంగానే బోధనైతే చేసింది కానీ, ప్రతిమారు మేకుబందీ చేసి శృంఖలాలను మరింత బిగించడమే జరిగింది. మనదేశంలో కుల

వ్యవస్థ, రాజకీయ సంస్థలను మించి పెరిగిపోయింది. ఇది తర తరాల వారసత్వమైన ఒక వృత్తి వ్యాపార సంస్థ.

మన కులాలు, సంస్థలు మనని ఒక దేశంగా రక్షించడానికి అవసరమైనాయి ఈ ఆత్మరక్షణావశ్యకత తీరిపోయిన తరువాత, యీ కులాలు, సంస్థలు సహజంగానే నశించి పోతాయి.

యూరోపు, అమెరికా దేశాల్లోని కులాలకంటే, మన భారతీయ కుల వ్యవస్థ మేలైనది. ఇదే సర్వవిధాల యోగ్యమైనదని అనను. కులమే లేకపోతే నీవు ఎక్కడ వుంటావు? కులమే లేకపోతే నీ విజ్ఞానమూ, సమస్త విషయాలూ అన్నీ ఎక్కడ వుంటాయి! కులమనేది ఎన్నడూ వుండి యుండక పోతే, ఐరోపావారికి అధ్యయనానికి ఏదీ మిగిలేది కాదు. మహమ్మదీయులు సమస్తాన్ని ముక్కచెక్కలు చేసి వుండే వారు. భారతీయ సాంఘిక వ్యవస్థ నేటికీ నిలబడి వుండడం నీకు ఎల్లా గోచరించేది? ఈ సంఘం ముందుకు సాగుతూనే వున్నది. విదేశీ దండయాత్రల సమయంలో చలనం మందగించినది, మిగిలిన సమయాల్లో అతివేగంగా సాగినది నేనిదే చెబుతాను నా దేశీయులకు. వారిని నేను నిందించను. వారి గతం లోకి తొంగిచూస్తాను. ఆ పరిస్థితులలో ఏ జాతికూడా యింత ప్రశంసనీయమైన పని చేయజాలదు. వారెంతో చక్కగా కృషిచేశారని చెబుతాను నేను వారికి. మరికొంత మెరుగ్గా

కులం తఱచుగా మారుతూనే వుంటుంది. మతసంబంధ విధులు నిత్యం మారుతూనే వున్నవి విధానాలు కూడా మారుతున్నాయి. వీటి సారాంశం, వీటి వెనుక ప్రధాన సూత్రం మాత్రమే మారదు.

కులమనేది పూర్తిగా మాయం కానక్కరలేదు. కానీ అప్పుడప్పుడు సర్దుబాట్లు జరుగుతుండాలి పురాతన సౌధంలో వున్న జీవమే రెండు లక్షల క్రొత్త కట్టడాలను నిర్మించడానికి సరిపోతుంది కుల నిర్మూలనం చేయాలనే కోరిక అర్థరహితం, పాత పద్ధతికి క్రమ పరిణామమే కొత్త పద్ధతి.

మన మాతృభూమికి యీ ప్రపంచం అమితంగా ఋణపడి వున్నది గొప్ప శాంత, సాధుమూర్తియైన హైందవునకు ఋణపడని జాతి ప్రపంచంలో లేదని ఒక్కొక్క దేశాన్ని పరిశీలించి చూస్తే తెలుస్తుంది ప్రాచీన కాలంలోను, ఆధునిక కాలంలోను ముందుకు పోతున్న జాతి జీవన తరంగాలపై తేలియాడి పరమ సత్య, శక్తి బీజాలు దూరతీరాలకు చేరుకొన్నాయి కానీ యీ తరంగయానం యుద్ధ కాహళి ప్రమోతలతోను, రణస్థలిలోని కాల్బలాల కదనులతోను జతగూడి నడిచిందని గుర్తుంచుకోండి. ప్రతి భావమూ, రుధిర ప్రళయంలో మునిగి చివికిపోవలసివచ్చింది. ఇతర జాతులు ముఖ్యంగా యిదే బోధించాయి. కానీ భారత దేశం మాత్రం వేల సంవత్సరాలుగా శాంతిగా జీవిస్తోంది.

అంతకు. మనుపు కూడ చరిత్రకందని కాలంనుండి, సంప్రదాయం కూడా తొంగి చూడడానికే భీతిపడే కారుచీకట్లు నిండిన భూతకాలంనుండి, యీనాటి వరకు భావపరంపరలు యీ దేశంనుండి ఎగసి ముందుకు వచ్చాయి. ప్రతి వాక్య-వెనుక ఒక ఆశీర్వాచనం, ప్రతిపదం ముందు ఒక శాంతి వచనం వుంది.

కాబట్టి హిందువులు గతాన్ని ఎంత ఎక్కువగా తరచి పఠిస్తారో భవిష్యత్తు అంత దీప్తివంతమవుతుంది. గతాన్ని ప్రతి గృహద్వారం వద్దకూ తీసుకొనిపోయేవారే జాతికి గొప్ప మేలు చేసిన వారౌతారు. ప్రాచీనుల న్యాయ, ధర్మ విధానాల దోషం వలన భారత దేశ క్రమవినాశనం, పతనం సంభవించలేదు. ఈ ధర్మ పద్ధతులు వాటి సహజక్రమంలో పరిణామాన్నీ, పరిసమాప్తినీ చెందనివ్వకుండా నిరోధించడం వల్లనే భారత దేశ పతనం సంభవించింది.

ద్వితీయాధ్యాయం

# మన జాతీయ మహాపరాధం

మన దేశ సామాన్య ప్రజాబాహుళ్యాన్ని నిరాదరణ చేయడమే మన జాతీయ మహాపాతకమని నేను భావిస్తున్నాను. ఇది మన పతన కారణాల్లో ఒకటి. మన దేశంలో రెండు మహాపాతకాలున్నాయి ఒకటి స్త్రీలను అణగద్రొక్కడం, రెండవది పేదవారిని కుల నిబంధనల తలతో రాచి రంపాన పెట్టడం.

మన దేశ సామాన్య ప్రజలను చూడండి వారి దృక్కులలో ఎంత వేదన, గుండెలలో ఎంత అదైర్యం, నిరుత్సాహం! పెద్ద ఉదరాలూ, శక్తి లేని కాళ్ళుచేతులూ! ప్రతి చిన్న విషయానికి వణికిపోయే భీరువులు వీరు! కుటీరాల్లో నివసించే నిజమైన మనజాతి తన పౌరుషాన్ని, వ్యక్తిత్వాన్ని మరచిపోయింది. తమ వారసత్వమైన అంతర్జ్యోతిని ప్రకాశింపచేసే అవకాశం మన సామాన్య ప్రజలకు ఏనాడూ లభింపచేయలేదు. మనం హిందూ, ముసల్మాను, లేక క్రైస్తవుల అడుగుల క్రిందబడి నలిగి, దిట్టంగా జేబునిండా ధనమున్న ప్రతి వారి పాదాల క్రిందబడి అణగిపోవడానికే, తమ జన్మ అని అనుకోవడం ఆరంభించారు యీ ప్రజలు.

రైతులు, సాలెవాళ్ళు మొదలైన నిమ్నజాతి, నిరాధృత ప్రజలు విదేశీయుల చేతిలో అపజయం పొందారు తమ వారి చేత అవమానాలు పొందుతున్నారు. వీరే అంతులేని వందల సంవత్సరాలనుండి తమ శ్రమకు ఫలితం ముట్టక పోయినా నిశ్శబ్దంగా పనిచేస్తున్నారు

బ్రాహ్మణుల పరపతి, క్షత్రియుల శక్తిసామర్థ్యాలు, వైశ్యుల కలిమి కూడా ఎవరి పరిశ్రమ వల్ల సాధ్యమైనాయో వారెక్కడున్నారు? అన్ని దేశాల్లో, అన్ని కాలాల్లో సంఘంలో ప్రధానాంశమై కూడా తక్కువ జాతిగా పేరుపొందిన ఆ 'జాతి' చరిత్ర ఏమిటి? ఓ భారత శ్రామిక ప్రజలారా! మీ నిరంతర నిశ్శబ్ద పరిశ్రమ ద్వారా బేబిలోన్, పర్షియా, అలెగ్జాండ్రియా, గ్రీస్, రోమ్, వెనిస్, జెనీవా, బాగ్దాద్, సమరఖండ్, స్పెయిన్, పోర్చుగల్లు, ఫ్రాంసు, డెన్మార్కు, హాలెండు, ఇంగ్లాండు దేశాలు ఒక్కటొక్కటిగా ఆధిక్యతపొంది, పెరన్నిక గాంచాయి! కానీ మీరో? మిమ్మల్ని గురించి పట్టించుకునే వారెవరు లెండి!

జీవన సమరంలో నిమగ్నమైపోయిన యీ జాతులకు జ్ఞానోదయానికి అవకాశం లేకపోయింది. మానవ సహజమైన తెలివి తేటలతో వారు యంత్రాలవలె ఎంతో కాలం ఒక్కతీరుగా పనిచేశారు. వారి పరిశ్రమ ఫలంలో అధికభాగాన్ని విద్యాధికులైన తెలివిగల ప్రజలు పుచ్చేసుకొన్నారు. ప్రతి దేశంలోనూ విషయం యిదే కానీ కాలం మారింది. క్రింది

తరగతులవారు మెల్లమెల్లగా మేల్కొంటున్నారు. ఈ సత్యం గ్రహించి ఐక్యతా ప్రతిఘటన జరుపుతున్నారు. తమకు ధర్మం ప్రకారం రావలసిన దానిని సాధించడానికి కృతనిశ్చయులైనారు. మొట్టమొదటగా మేల్కొని యిప్పటికి పోరాటం ప్రారంభించినవారు యూరోపా, అమెరికాల్లోని సామాన్య ప్రజలు. మన భారత దేశంలో కూడా యీ జాగృతీ చిహ్నాలు కనుపిస్తున్నాయి. క్రింది తరగతుల వారిలో యీనాడు జరిగే అనేక సమ్మెలే దీనికి తార్కాణం. ఎంత యత్నించినా పై తరగతులవారు క్రింది వారిని ఎన్నడూ అణచి పెట్టలేరు. తక్కువ తరగతివారు తమ న్యాయసమ్మతమైన హక్కులను పొందేందుకు చేయూత నివ్వడంలోనే, ఉన్నత తరగతులవారి సంక్షేమం యిమిడి వున్నది.

చెమటోడ్చి పనిచేసే లక్షలాది పేద పీడిత ప్రజానీకం తమ గుండెనెత్తురు చిందించి సుఖడోలికలలో వూగించగా, పెరిగి, విద్యావంతుడై, ఆ పేదజనం గురించి ఒక్కనాడైనా ఆలోచించని వాడిని ద్రోహి అంటాను నేను మీ ధనికవర్గ చరిత్రలో, మీ ఉన్నత వంశీయుల పురోహితుల, అధిపతుల చరిత్రలలో ఏ ఘట్టంలోనైనా, పేద ప్రజలను గురించిన చిన్న యోచన వున్నదా? వారి వర్గాల అధికార శక్తికి మూలం వీరి రెక్కల ముక్కల చాకిరీయేగా?

మన దేశంలోని ప్రతి బాధకు, అన్యాయానికి మూల

కారం, విదేశీ దండయాత్రలు వారిని శతాబ్దాల తరబడి నేలకు త్రొక్కివేశాయి. చివరకు తాము మనుష్యులమని కూడా మర్చిపోయినారు వారు. మన పూర్వీకులైన జమీందారీ భూస్వాములు సామాన్య మానవులను కాలిక్రింద అణగ ద్రొక్కి వుంచబట్టి, ఆ బాధకులోనైన ప్రజలు తాము మానవులమన్న మాట దాదాపుగా మర్చిపోయినారు. పరిమితమైన ఒక పదిమంది కేవలం తమ పొగరు, ఆచారికపు అధికారాలు పూర్తగా కొని, దేశంలోని విద్యావివేకాల నన్నిటినీ గుత్తగా తీసికొనడమే మన దేశవినాశనానికి కారణం మన దేశంలోని నిమ్నజాతికి, పేదవారికి, పతితులకు మిత్రుడనేవాడు లేడు. వారెంత ప్రయత్నించినా ఆ స్థితిలోంచి పైకి లేవరు. నానాటికీ వారు క్రిందికి దిగజారి క్రుంగిపోతారు. క్రూరసంఘం కొట్టే దెబ్బలను భరిస్తారుగానీ, ఆ దెబ్బలు ఎక్కడనుండి పడ్డాయో తెలుసుకోలేరు. కట్టెలు కొట్టేవారుగా, నీళ్లు తోడేవారుగా శతాబ్దాలుగా బలవంతాన పనిచేసి, వారు తాము బానిసలుగానే పుట్టామని విశ్వసించి, ఎప్పటికీ కట్టెలు కొట్టుకుంటూ, నీళ్లుచేదుకుంటూ బ్రతుకుతున్నారు వేదాంతానికి పుట్టినిల్లయిన మన యీ భూమిలో, మన ప్రజలు యీ స్థితిలోనే తరతరాలుగా మతిభ్రమణకు లోనై పడివున్నారు. వారిని అంటుకుంటే కలుషమై పోతాము వారితో కూర్చుంటే మైలబడిపోతాము! నికృష్ట జీవులుగా పుట్టారు వారు, నికృష్ట జీవులుగానే ఉండిపోవాలి! పర్యవసానమేమిటంటే వారు క్రుంగి,

కృశించి, అణగిపోతున్నారు, యింకా యింకా అణగిపోయి, మానవు డెవ్వడూ దిగజారలేని అధమ స్థితికి చేరిపోయారు.

అన్ని దేశాలలోకి మనదేశం ఎందుచేత అతిబలహీన మైనదీ, అతి వెనుకబడినదీ? 'శక్తి'ని గౌరవహీనంగా భావి స్తున్నాము కనుకనే స్మృతులను రచించి, కఠిన నియమాలతో కట్టిపడవేసి, పురుషులు స్త్రీలను కేవలం ఉత్పత్తి యంత్రా లుగా తయారుచేసి వేశారు సట్టుమని పదమూడేళ్లు నిండ కుండనే బిడ్డల తల్లులై పోతున్న మన బాలికలను చూడండి. భగవంతుడా! నాకు సర్వమూ యిప్పుడు గోచరమవుతున్నది. "యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః" - "స్త్రీలను గౌరవించిన చోట దేవతలు సంతృప్తులవుతారు!" అన్నాడు అలనాటి మనువు మనం భయంకర పాపులం, మన పతనానికి హేతువు స్త్రీలను 'తుచ్ఛకీటకాలుగాను', 'నరక ద్వారాలు'గాను పిలువడమే స్వర్గానికి, నరకానికీ గల తేడా అంతలోనే వున్నది

"అర్హతనుబట్టి కానుకలను ఆ దేవుడే నిర్ణయిస్తాడు' ఆ భగవంతుణ్ణి కూడా అర్థరహిత ప్రేలాపనతో మాయ బుచ్చాలా! భగవంతుడు అన్నాడు, "త్వం స్త్రీ, త్వం పుమానసి, త్వం కుమార ఉత వా కుమారీ" అని. "నీవే స్త్రీవి, నీవే పురుషుడవు, నీవే బాలుడవు, నీవే బాలి కవు కూడా"—కానీ మనం మాత్రం "దూరమపసర రే

అంటున్నాము. "కేనైషా నిర్మితా నారీ మోహినీ"—
"మోహన స్వరూపిణియైన స్త్రీని ఎవరు తయారుచేశారు!"

జాతి అట్టడుగుకి దిగజారుతోంది. లెక్కకందని లక్షలాది జనుల శాపం మనకు తగిలింది. నిరంతర జీవనది పక్కనే ప్రవహిస్తున్నది, కానీ దాహంతో అల్లుకొనిపోయి చనిపోతున్న యీ ప్రజలకు మాత్రం మనం మురికి గుంటలోని నీరే పోశాము. కష్టించుటతో కలిమి కనుల పండువు చేస్తోంటే యీ ప్రజలను ఆకలి మంటలకు ఆహుతి చేశాము. వారికి అద్వైతబోధ చేసి, వారిని మాత్రం మనశక్తి నంతా వినియోగించి ద్వేషించాము లోకాచారమనే ఒక దర్శాన్ని కని పెట్టాము—ఈ లెక్కకందని లక్షల ప్రజలకోసం. మనమంతా ఒక్కటే, అందరిలోనూ పరమేశ్వరుడొక్కడే అని సిద్ధాంతాలు వల్లెవేసి, అణుమాత్రం కూడా ఆచరణలో చూపించలేము. ఇటువంటి వీరందరి శాపమూ మన మీద వున్నది.

భూప్రపంచంలోని ఏ మతమూ మానవుని ఘనత గురించి హిందూమతం వలె ఉద్ఘాటించదు. అల్లాగే భూప్రపంచంలోని ఏ మతమూ కూడా హిందూమతం వలె పేద, నిమ్న జాతిప్రజల కుత్తుకల మీద ఎక్కి స్వారీ చేయదు. ఇప్పుడు మన మతం ఎక్కడ వున్నది? 'అస్పృశ్యత'లో, అంటరానితనంలో మాత్రమే వున్నది మన మతం. మనం వారిని తాకము! వారి పొడ తగులకుండా తప్పించు

కొంటాము! మనం మనుష్యులమేనా? పరమేశ్వరా, మని·
షికి మనిషి సహోదరుడు ఎప్పుడవుతాడు

మతంలో కులం లేదు కులమనేది కేవలం ఒక సాంఘిక వ్యవస్థ. కాబట్టి మతాన్ని నిందించి లాభం లేదు. మనుష్యులనే తప్పుబట్టాలి. పూజావ్రతాల ఆడంబరాలంటే విసిగిపోయి, మతతత్త్వజ్ఞుల ధోరణికి విభ్రాంతి చెందిపోయి ప్రజలు మూకుమ్మడిగా అనాత్మవాదంలో చేరిపోయారు కుల సమస్యకు, పూజాడంబరాలు, మత తత్త్వం, అనాత్మవాదం - అనే మూడింటి త్రికోణ పోరాటమూ-అనే వాటికీ ప్రారంభమిదే. ఇది ఈనాటి మనవరకు అపరిష్కృత సమస్యగానే మిగిలిపోయి, మనకు సంక్రమించినది.

జాతి ధర్మానికి పునాది సైతం కదలిపోయిందనడానికి నిదర్శనం — మన పతనావస్థయే. 'జాతిధర్మం' అని దేనినైతే పిలుస్తున్నామో దానికి పూర్తి వ్యతిరేక పరిస్థితే ఈనాడు నెలకొని వున్నది. మీ శాస్త్రాలను తఱచి తఱచి చదవండి శాస్త్రాల్లో కుల ధర్మాలుగా చేసిన నిర్వచనాలు ఈ భూమి మొత్తం మీద మాయమైనాయని, తేలిగ్గా మనకు అర్థమౌతుంది.

భారతదేశ పతనానికి హేతువేమిటి? కులాన్ని గురించిన నిర్వచనాన్ని విడిచి పెట్టడమే. భగవద్గీతలో చెప్పినట్లుగా, కుల నిర్మూలనంతో ప్రపంచమే నిర్మూలనమై

జాత్యభివృద్ధికి అవరోధం. 'జాతి' లేక వర్గం లేక 'వైవిధ్యం' అనే వాటి స్వతంత్ర చలనాన్ని అరికట్టింది ఈనాటి కులం. ఒక అమ్మాయి గానీ, అబ్బాయిగానీ పుట్టగానే జ్యోతిష్కులు ఆ శిశువు వర్ణ నిర్ణయం చేయడానికి సిద్ధపడుతారు. అదే నిజమైన కులం - వ్యక్తిత్వం. జ్యోతిష్కులు దానిని గుర్తిస్తారు. తిరిగి ఈ పద్ధతి సంపూర్ణంగా ఆచరణలోకి రావడం వలన మనం ఔన్నత్యాన్ని అందుకోగలము. ఈ వర్ణ వైవిధ్యం అసమానత్వం కాదు ప్రత్యేక సౌకర్యాలు కూడా కాదు. ఘనీభవించిన ఒక ధనికవర్గం గానీ, ప్రత్యేక మినహాయింపులు గల వర్గంగానీ వర్ణ వ్యవస్థను గొడ్డలి పెట్టువంటివి. అది కులవ్యవస్థ కానేరదు. 'జాతి' వ్యవస్థ తిరిగి అమలులోనికి రావాలి. వర్ణ పద్ధతిన వున్న విఘాతాల నన్నిటినీ ఛేదించాలి అప్పుడే మనం ఉన్నతిని అందుకొంటాము.

పేదవారికి, అజ్ఞానులకు స్వేచ్ఛనిస్తే, అంటే వారికి శారీరక స్వేచ్ఛ, ఆర్థిక హక్కులూ - సర్వమూ యిచ్చివేస్తే, ఉన్నత వర్గాలలోని పిల్లలతో బాటుగా ఈ పిల్లలకీ తమ స్థితి మెరుగు పరచుకోవడానికి, జ్ఞానం సంపాదించడానికీ సకలావకాశాలూ యిస్తే, వారిలో వక్రబుద్ధి జనిస్తుందని కొందరంటూరు. కానీ అల్లా అనేవారు సంఘశ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని అంటున్నారా లేక స్వీయప్రయోజనం కోసమా? మతాచార్యకత్వమనేది మనదేశానికి చేటు తెచ్చి

తెం

తాను అధోగతిపాలు కాకుండా వుండగలడా? తనను తాను నొప్పించుకోకుండా యితరులను నొప్పించగలడా? బ్రాహ్మణ, క్షత్రియ నియంతృత్వ పరపీడనమంతా మూటగట్టుకొని చక్రవడ్డీతో సహా వారి నెత్తినే పడింది. నిర్దయాత్మకమైన కర్మ సిద్ధాంతం వారిపైనే ప్రభవిస్తూ వేయి సంవత్సరాల బానిసత్వాన్ని అధోగతినీ వారికి చవి చూపిస్తోంది

ఎవరైతే గత వేయి సంవత్సరాలుగా పేదవారి రక్తాన్ని పీల్చి పిప్పి చేసి, 'వారిని బలిపెట్టి తాము విద్యాధికులైనారో, ఎవరైతే పేదవారి పేదరికం పునాదిగా శక్తిమంతులైనారో వారినే వందలు, వేలమంది బానిసలుగా అమ్మివేయడం జరిగింది. వారి భార్యలు, కుమార్తెలు అవమానితులైనారు. వారి ఆస్తిపాస్తులు కొల్లగొనడం జరిగింది. ఇదంతా నిష్కారణంగా జరిగినదంటారా?

ప్రజలలో అధిక భాగం నికృష్టకులాలకు చెందినవారే. పై కులాలవారు తిట్లు, దెబ్బలతో ప్రతి అడుగునా హింసల పాలు చేయడంవల్ల వారు తమ పౌరుషాన్ని కోల్పోయినారు. బిచ్చమెత్తుకొనే వృత్తిలోకి దిగారు. వారే మన విద్యాబోధన ఖర్చు భరిస్తారు; వారే మన దేవాలయాలను నిర్మిస్తారు; ప్రతిఫలంగా తన్నులు తింటారు.

మన దేశంలో తక్కువ కులంలో పుట్టిన వారెవరైనా సరే, శాశ్వతంగా వారు నశించినట్లే. ఆశ అనేది లేదు [illegible] వెళ్ళి చూడండి. అక్కడ పురో

హితులు ఎక్కువ-దేశం మొత్తం మీద ప్రతి అంగుళం భూమికీ కామందులు బ్రాహ్మణులే అక్కడ నాలుగోవంతు ప్రజలు క్రైస్తవులైనారు, హిందువుల సానుభూతి, లోపించిన కారణంగా మదరాసులో వేలాది నిమ్నజాతి ప్రజలు క్రైస్తవులుగా మారుతున్నారు ఇది కేవలం ఆకలి మంటతో అనుకోకండి మననుంచి వారికి సానుభూతి దొరకనందునే అల్లా మారిపోయినారు

భారత దేశంలోని పేదవారిలో అధికభాగం ముసల్మానులున్నారు ఎందుచేత? వారిని కత్తితో బెదరించి మతం మార్పించారన్నది అర్థంలేని మాట జమీందారులనుండి-గ్రామ్యాలనుండి విముక్తి పొందడానికే మారారు. ఈ కారణంగానే ఎంతోమంది జమీందారులున్న బెంగాలు దేశంలో రైతులలో హిందువులుకంటే మహమ్మదీయులు ఎక్కువ వున్నారు.

అస్పృశ్యులనబడు ప్రజలను, యీనాటి అధ్వాన్నస్థితికి దిగజార్చినవారెవ్వరు? ఎవరు దీనికి బాధ్యులు? ప్రతిసారీ ఒకే జవాబు వస్తుంది యీ ప్రశ్నకి. ఆంగ్లేయులు మాత్రం కారు వారు యిందుకు బాధ్యులు కానేకారు, మన దౌర్భాగ్యానికి, అధోగతికి మనం మాత్రమే బాధ్యులము. క్రూరవర్తనకు సాకులుగా అనేక పారమార్థిక, వ్యావహారిక సిద్ధాంతాలను కనిపెట్టిన హిందూమతం లోని కుటిలులే యిందుకు

మనమెంతో పేదవారం అని ఎలుగెత్తి ఏడవడం మనం వింటుంటాము కాని పేదవారి క్షేమం కోసం ఎన్ని ధర్మసంస్థలున్నాయి? మన దేశంలోని లక్షలాది నిరుపేదల బాధలు, వేదనలు తలచుకొని వారి ఆర్తిని విని ఎంతమంది నిజంగా కన్నీరు కారుస్తున్నారు? మనం అసలు మనుష్యులమేనా? వారి జీవనభృతికి, వారి అభివృద్ధికి మనం ఏమిచేస్తున్నాము?

మనం చాల విషయాలు చిలకల్లా పలుకుతుంటాము. కానీ వాటిని ఆచరించము. మాట్లాడ్డమేగానీ, ఆచరించక పోవడం మనకి అలవాటై పోయింది. దీనికి కారణమేమిటి? శారీరక బలహీనత ఈ శారీరక బలహీనతే మన దౌర్భాగ్యాల్లో మూడో వంతుకు హేతువని చెప్పవచ్చును. మనం బద్ధకస్తులం, పనిచేయలేము, ఐక్యతగా కలవలేము. ఒకరి నొకరు ప్రేమించుకోము; అతిగాఢమైన స్వార్థముంది మనలో. ముగ్గురు మనుష్యులము ఒకరి నొకరు, ద్వేషించకుండా, ఒక చోట ఒకరు అసూయపడకకుండా దగ్గరకు రాలేము

మన జాతిలో నిర్వహణాదక్షత పూర్తిగా లోపించింది. ఈ ఒక్క లోపం వల్లనే అనేక దుష్పరిణామాలు కలుగుతున్నాయి ఏదైనా ఒక అంశం గురించి ఐక్యతాఘటన ఆరంభించడానికి మనం విముఖులుగా వున్నాము. నిర్వహణా సామర్థ్యానికి మున్ముందుగా విధేయత అనేది అత్యవసరం.

మనకు యిక్కడ రెండు చెడుగులున్నాయి. ఒకటి మన బలహీనత రెండవది [illegible]

చిన మన హృదయాలు. మనం లక్షల సిద్ధాంతాలను గురించి ఉపన్యసించవచ్చును. కోట్ల సంఖ్యలో మనకు మతాంతర్గత శాఖలుండవచ్చును. కానీ స్పందించే హృదయం లేనంతవరకు ఇవన్నీ ఎందుకూ కొఱగావు

అస్పృశ్యులు మనలోనే ఒక భాగమని భావించేవరకు; మీరు, వారు, పేద, గొప్ప, పుణ్యాత్ముడు, పాపాత్ముడు అందరూ పరబ్రహ్మమైన ఆ పరమాత్మలోని భాగాలని భావించే వరకు; వారికొరకు బాధపడాలి. అదే మన వేద ప్రబోధం.

# మూడవ అధ్యాయం

## ప్రజా జాగృతి



మన దేశంలోని సామాన్య ప్రజలు గాఢ నిద్రలో వున్న మకరములవంటివారు నైతికంగా ఒక్క ఆదర్శమూ, ఆశా లేనటువంటి భవిష్యత్తనేది శూన్యమైనటువంటి, తమకు మేలుచేయడానికి యత్నించే వారిపై లభించేటువంటి యీ మృత మహాకాయం లోకి ప్రాణం పోయగలమా మనం? కాళ్ళతో తన్నుతూ వుండే మొండి పిల్లవాడి గొంతులో మందు పోసే, వైద్యుని పాత్ర మీరు వహించగలరా?

బొమ్మలను మనసారా ప్రేమించినట్లైతే వాటికి ప్రాణాలు వస్తాయని జపాను బాలికలు నమ్ముతారని నేను ఆ దేశంలో విని వున్నాను. ఈ దేశప్రజలను ఎవరేనా మన స్ఫూర్తిగా ప్రేమించినట్లయితే దేశం తిరిగి మేల్కొంటుందని నేను కూడా విశ్వసిస్తున్నాను ఈ ప్రజలపట్ల ధనలక్ష్మి దయ మాలినది. వారి అదృష్ట భాండము పగిలిపోయినది. వారి వివేకము నశించినది. కాళ్ళ క్రింద అణిగిపోయి, పస్తుల పాలై, కీచులాడుకొంటూ, అసూయాపరులైన ప్రజలు వీరు.

ఒక జాతిగా మన వ్యక్తిత్వాన్ని కోల్పోవడమే మన దేశంలోని అనర్థాలన్నిటికీ హేతువు. కోల్పోయిన యీ వ్యక్తిత్వాన్ని జాతికి తిరిగి యిచ్చి, సామాన్యప్రజలను ఉద్ధరించాలి భారత దేశ సముద్ధరణ జరగాలి మత గురువుల దుర్మార్గత్వము తొలగించాలి. అందరికీ మరింత ఆహారము, మరెన్ని అవకాశాలు దొరకాలి

మొట్టమొదటగా కావలసినది కూర్మావతార పూజ. కూర్మమంటే ఉదరం. దానికి అధినాథుడే ఈ కూర్మము. అతడిని శాంతింప చేస్తేగానీ, మీ మతాల ముచ్చట్లు ఎవ్వరూ వినరు. ఆకలి పిశాచాన్ని ఎల్లా ఎదుర్కోవాలా అనే ఆలోచనతోనే. భారత దేశం అలజడి చెందుతోంది. ఎవరికైతే మతబోధన చేయాలనుకుంటున్నారో వారిని మొట్టమొదట యీ పాపిష్టి ఆకలినుంచి, మలమల మాడిపోవటాన్నుంచీ, ఏ విధంగానైనా ప్రాణాలు నిలుపుకోవాలనే ఆత్రుతనుండి విముక్తి కలిగించాలి. లేకపోతే, ఉపన్యాసాలుగానీ, అటువంటి యితర యత్నాలేవిగానీ లాభించవు ముందు అన్నం, ఆ తరువాతే మతం పాపం ఆ వెర్రి ప్రజలు ఆకలితో మాడుతోంటే, మనం మతబోధన అమితంగా రుద్దుతాము. ఆకలి మంటలను ఏ వితండవాదం ఆర్పలేదు.

సంఘ సంస్కరణ గురించి ఒక అర్ధ శతాబ్దిపాటు మహా హడావిడి జరిగింది. గత పది సంవత్సరాలుగా వివిధ ప్రదేశాలలో నేను పర్యటనాలు చేస్తున్నప్పుడు దేశం

యీావత్తూ సంస్కరణ సంస్థలతో నిండివుండటం గమనించాను. సామాన్య ప్రజల రక్తాన్ని పీల్చి పెద్ద మనుష్యులైనవారు, యింకా పెద్ద మనుష్యులుగానే చలామణీ అవుతున్నారు. కాని వీరు నిర్మించిన ఏ సంస్థ కూడ పేద ప్రజలకోసం కనబడ లేదు. భారత దేశాన్ని పునరుజ్జీవితం చేయవలెనంటే వారి కోసమే మనం పనిచేయాలి. మన దేశంలోని సామాన్య ప్రజలకు చక్కగా విద్య నేర్పించి, కడుపునిండా తిండిపెట్టి, బాగా సంరక్షణ చేసేవరకూ ఎటువంటి రాజకీయాలూ పనికిరావు.

జాతి కుటీరాల్లోనే నివసిస్తుందని గుర్తుంచుకోండి. కానీ పాపం, ఎవ్వరూ వారికి ఏమీ చేయలేదు. ఒక జాతి సౌభాగ్యం, ఆ జాతిలోని ఎంతమంది వితంతువులకు భర్తలు దొరుకుతారన్న దానిమీద కాక, సామాన్య ప్రజల స్థితి మీదే ఆధారపడి వుంటుంది. వారిని ఉద్ధరించగలరా? వారి సహజ ఆత్మస్వభావం కోల్పోకుండా, పోగొట్టుకున్న వ్యక్తిత్వాన్ని తిరిగి ప్రసాదించగలరా? ఇదే మనం చేయవలసింది. మనం చేస్తాము కూడా.

అసంఖ్యాకమైన వ్యక్తుల సముదాయమే ఒక జాతి. వ్యక్తులకు శిక్షణ యివ్వటం కంటే మించిన ఆశయం నాకు ఏదీ లేదు. మన గురించి మనం శ్రద్ధవహించాలి. ఆపాటి మనం చేయగలము. మీ జీవితాలు స్వచ్ఛంగా, సన్మార్గంలో వుంటేనే యీ ప్రపంచం కూడా స్వచ్ఛంగా సన్మార్గంలో

మనం దానికి సాధనగా

ఉంటాము. కాబట్టి మనల్ని మనము పరిశుద్ధ పరచుకొందము. మనల్ని మనము దోషరహితులుగా చేసికొందాము.

ముందుగా స్త్రీ జనోద్ధరణ, సామాన్య ప్రజల జాగృతి జరగాలి. ఆ తర్వాతనే మన దేశానికేదైనా నిజమైన మంచి చేకూరేది.

సంఘ సంస్కర్తలకు నేనొక్కటే చెప్పదలచుకొన్నాను —నేను వారికంటే గొప్ప సంస్కర్తనని వారు చిన్న చిన్న ముక్కలను సంస్కరించదలచుకొన్నారు. నాకు వ్రేళ్ళనుంచి కొమ్మలవరకు సంస్కరణ కావాలి. పద్ధతిలోనే మేము భేదిస్తాము. వారిది విధ్వంసక పద్ధతి; నాది నిర్మాణ పద్ధతి. నాకు సంస్కరణలో విశ్వాసం లేదు. అభివృద్ధిలోనే విశ్వాసమున్నది. నేను భగవంతుని స్థానములో పీఠమధిష్టించి, "మీరు యీ దిశగానే కదలాలి, అటుకాదు" అని శాసించడానికి సాహసించను. నేను కేవలం శ్రీరాములు వారికి వారధి నిర్మాణంలో సాయపడిన ఉడుతవలె మాత్రమే ఉండదలచాను, తనవంతు యిసుక రేణువులను వారధిపైన పోయడంతోటే తృప్తి పొందిన ఉడుతవలె ఉండదలచాను. అద్భుతమైన యీ జాతీయ యంత్రము యుగాలుగా పనిచేసినది—యీ జాతి జీవన స్రవంతి మన ముందు ప్రవహిస్తున్నది. ఇది యోగ్యమైనదో కాదో, యిది ఎటు పయనించవలెనో చెప్పడం ఎవరితరం? అల్లా చెప్పడానికి ఎవరికి సాహసం వున్నది? జాతి జీవనాగ్ని కోరే ఇంధనములు సరఫరా చేయాలిగానీ, వృద్ధిమాత్రం దాని సొంతమే. అది ఎలా పెంపు కావలెనో ఎవ్వరూ శాసించ

లేరు. మన సంఘంలో దురాచారాలు కొల్లలుగా వున్నాయి కానీ యిటువంటి దురాచారాలు అన్ని సమాజాల్లోనూ వున్నాయి. మరింక దూషించడం దేనికి? ప్రతివారూ యిది చెడు అని చెప్పగలరుగానీ అందులోంచి బయటపడే మార్గం చెప్పగలిగినవాడే మానవజాతికి ఆప్తుడు. సంఘ సంస్కర్తలకు మన దేశంలో ఎన్నడైనా కొరత వుందా? భారతదేశ చరిత్రను చదివారా? రామానుజుడెవరు? ఆదిశంకరుడెవ్వరు? నానకు, చైతన్య, కబీరు, దాదు—వీరంతా ఎవ్వరు? నక్షత్ర పరంపరలా మహోజ్వలంగా ఒకరి తర్వాత ఒకరుగా ప్రకాశించిన యీ మతాచార్యులంతా ఎవరు? వారంతా యత్నాలు చేశారు, వారి కృషి యింకా కొనసాగుతునే వున్నది అయితే ఒక తేడావుంది. ఈనాటి ఆధునిక సంస్కర్తలవలె వారు దూషణలకు పూనుకోలేదు. వారి ముఖతః ఆశీస్సులే కురిశాయి, ఇందులోనే కొండంత భేదమున్నది మన సహజ స్వభావం ప్రకారం మనం వృద్ధి చెందాలి. విదేశీ వ్యవస్థలు నడిచిన పథంలో మనం పయనించవలెననుకొంటే అది వృథా. నేను యితర జాతుల వ్యవస్థలను తప్పు బట్టను వారికి అవే మంచివి, మనకు కావు. వారికి అమృతమైనది మనకు విష తుల్యం కావచ్చును. ఇది మనం నేర్చుకొనవలసిన ప్రథమ పాఠం. ఎంతో శాస్త్ర పరిజ్ఞానం, ఎన్నో సంస్థలు, ఎన్నో యితర సంప్రదాయాలు అండగా వుండగా యీనాటి వారి వ్యవస్థ ఏర్పడింది. మన సంప్రదాయాలు, వేలాది సంవత్సరాల మన కర్మను బట్టి, మన సహజాభిరుచికి అలవాటైన గాడిలో

'మనం నడవవలసినదే. ఇదే మనం చేయాలి. జీవితమంతా కృషికే అంకితం చేసిన, లేదా చేయ ప్రయత్నిస్తున్న ఒక వ్యక్తిగా నన్నొకమాట చెప్పనివ్వండి. ఆముష్మిక సాధన తప్పితే భారత పునరుజ్జీవనానికి వేరొక మార్గం లేదు మతం ఒక్కటే మనకు జీవాన్నిచ్చేది అది పోయినప్పుడు భారత దేశమే కన్నుమూస్తుంది. కాబట్టి ప్రతి అభ్యున్నతికి ముందు మతమొక తరంగంగా, వెల్లువగ్గాపై కుబికి, ఉరకడం అవసరం. సామ్యవాద, రాజకీయ భావాలతో దేశాన్ని ముంచెత్తే ముందుగానే ఆధ్యాత్మిక భావ వాహినిలో యీ నేలను తడపండి.

సర్వసంగ పరిత్యాగం, నిస్వార్థసేవ అనేవి మన జాతీయ ఆదర్శాలు ఆ మార్గాలలో దేశాన్ని తీవ్ర కృషి జరుపనివ్వండి మిగిలిన విషయాలన్నీ అవే చక్కబడుతాయి మన దేశంలోని సంస్కర్తలందరూ ఒకే ఒక్క పెద్ద పొరబాటును చేశారు అదేమిటంటే మతాచార్యుల ఘోర వంచనలకీ, అధఃపతనానికి కూడా మతమే పూచీపడాలన్న భావంతో, వారు నాశనానికి అతీతమైన వ్యవస్థను నాశనం చేయబూనుకొన్నాను. ఫలితంగా వారు అపజయాన్నే పొందారు. గౌతమబుద్ధునినుండి రాజారామమోహనరాయ్ వరకు గల మహనీయులందరూ కులమనేది ఒక మత వ్యవస్థగా భావించి, మతాన్నీ కులాన్నీకూడా కూలద్రోయాలని ప్రయత్నించి విఫలులైనారు. విను నేస్తం, భగవంతుని అపార దయ వలన నేను యీ రహస్యాన్ని కనుగొన్నాను. మత

మన్నది ఒక మచ్చు కాదు. హైందవ సంఘాన్ని సంస్కరించ వలెనంటే మత వినాశనం అవసరం లేదు. మతం కారణంగా యీ సంఘం యీ స్థితిలో లేదు మత సూత్రాలను సంఘంలో సరైన రీతిగా అన్వయం చేయనందువల్లనే యిది యిలా వున్నది ఇందులోని ప్రత్యక్షరం మన ప్రాచీన గ్రంథాలు ఆధారంగా నేను నిరూపించగలను. పరిస్థితులను మనం చక్కదిద్దగలం - ఎల్లా? అది మత వినాశనం ద్వారా కాక హైందవ ధర్మంలోని మహత్తర బోధలను ఆచరించడం ద్వారానే సాధ్యపడుతుంది

మంచికో, చెడుకో, మతాదర్శాలు మన దేశంలోకి వేలాది సంవత్సరాలుగా ప్రవేశిస్తూ వున్నాయి. మంచికో, చెడుకో, మన భారత దేశ వాతావరణంలో మతసంబంధమైన ఆదర్శాలు వందల శతాబ్దాలుగా ప్రభవిస్తున్నాయి మంచికో, చెడుకోగానీ మనం యీ ఆదర్శాల మధ్యన పుట్టి పెరుగుతున్నాం. ఇవి మన రక్తంలో ప్రవేశించి, నరాల్లో స్పందిస్తూ, శరీరతత్వంలో ఒకభాగమై, మన జీవనశక్తిగా మారిపోయినాయి. ఇటువంటి మతాన్ని - అంత బలమైన ప్రతీకార శక్తిగా పురికొల్పకుండా ఆ మహాస్రవంతి తనకై వేలాది సంవత్సరాలుగా ఏర్పరచుకొన్న ప్రవాహ మార్గాన్ని భంగ పరచకుండా - యీ మతాన్ని వదలుకోగలమా? గంగానది తన మంచుకొండలలోకి తిరిగిపోగా, కొత్తమార్గాన ప్రవాహం ఆరంభించవలెనని మీరనుకొంటున్నారా? అదే ఒకవేళ

జీవన మార్గాన్ని వదలుకొని, రాజకీయాన్నో-మరొకదాన్నో కొత్త వ్యాపకంగా స్వీకరించలేదు. ఏ కార్యమైనా మనం కనీస నిరోధన సూత్రం ప్రకారమే నిర్వర్తించగలము. మన దేశంలో మతమనేదే యీ కనీస నిరోధన రేఖ. ఇదే జీవన రేఖ, యిదే ప్రగతి రేఖ, సంక్షేమ రేఖ, మతమనే గాడిలో పడడమే మన పద్ధతి.

ఐతే, మిగతా అంశాలేవీ అవసరం లేవని నేననను. రాజకీయ, సాంఘిక అభ్యుదయం అవసరం లేవని నేను చెప్పను. అవన్నీ యీ దేశంలో రెండో స్థానాన్నే ఆక్రమిస్తాయి. మతమే ప్రధానాంశం. అది మీరు గుర్తుంచుకోవాలి అని మాత్రమే చెప్పదలచుకొన్నాను. భారత హృదయము ముందు మతభావ పూరితం, ఆ తరువాతనే మరొక దానికి స్థానం. మన ప్రాణాధారమైన రక్తం ఆధ్యాత్మికత. ఈ ప్రాణాధార రక్తమేగానీ స్వచ్ఛంగా, బలంగా, శక్తిసంపన్నంగా ప్రవహిస్తే చాలు. రాజకీయ సాంఘికమైన లోపాలూ, యితర ప్రాపంచిక లోపాలన్నీ, చివరికి మన దేశ దారిద్ర్య చిహ్నాలూ అన్నీ కూడా చక్కదిద్దబడుతాయి మన దేశంలో--సంఘ సంస్కరణ బోధించదలచుకున్నాగానీ, ఆ క్రొత్త వ్యవస్థ వలన నూతనంగా ఆముష్మిక జీవితం ఏది ఉదయిస్తుందో చెప్పటం అవసరం, రాజకీయమైనా సరే ప్రబోధించదలచుకుంటే, దాని వలన జాతికి కావలసిన ఒకే ఒక అంశం - ఆధ్యాత్మిక శక్తి ఎంతగా దింపుకోగలుగుతామో

సామ్యవాదమో, మరో ప్రజాపాలన పద్ధతో రావా లోందని దేశంలోని ప్రతి అంశం స్పష్టీకరిస్తోంది. ప్రజలకు భౌతికావసరాలైన అంశాలు—అంటే తక్కువపని, అణచే వారుగానీ, యుద్ధంగానీ లేకపోవడం, మరింత ఆహారం— యివి తీర్చడం కూడా అత్యవశ్యమైన విషయమే. కానీ మతం ప్రాతిపదికగా లేకపోతే, మనిషి మంచితనం ప్రాతిపదిక కాకపోతే, ఆ వ్యవస్థ చిరకాలం వర్ధిల్లగలదని నమ్మకం ఏమున్నది?

మన బాధలన్నిటినీ శాశ్వత పద్ధతిన మట్టుపెట్టగలది ఆధ్యాత్మిక జ్ఞాన మొక్కటే. ఇతర జ్ఞానం ఏదైనాగానీ స్వల్ప వ్యవధి వరకే బాధలను తొలగించగలదు. కాబట్టి, దేశంలోని ప్రతి మనిషీ కూడా ధర్మ, అర్థ, కామమోక్షా లను సాధించుకోవడానికి చేయూత నివ్వడమే మన లక్ష్యం. "మతభావాలను భగ్నపరచకుండా సామాన్య ప్రజల సముద్ధరణమే మన లక్ష్యంగా మన ముందుంచుకోవాలి"

మనం నేర్చుకోవలసిన మరొక గొప్ప పాఠం, అనుకరణ అనేది నాగరికత కాదు అని. అనుకరణ, పిరికితనంతో కూడిన అనుకరణ అనేది ఎన్నడూ అభ్యుదయాన్ని సాధించదు. అది మనిషిలోని భయంకరమైన పతనానికి ప్రత్యక్ష చిహ్నం. మనం యితరులనుండి అనేక విషయాలు నేర్చుకోవాలి. ఇతరులనుండి నేర్చుకోవడానికి నిరాకరించేవాడు మృతుడైనట్లే లెఖ్క. మంచిదైన ప్రతిదీ యితరులనుండి నేర్చుకోవాలి. కానీ దాని స్వీకరించి, నీ సహజ పద్ధతిలో

ఆకళింపు చేసుకో. నీవే, యితరులవలె మారిపోవద్దు ఈ భారతీయ జీవనంలోంచి బయటకు యీడ్చివేయబడడానికి అంగీకరించవద్దు. భారతీయులందరూ, వేరే జాతులవలె వేషం ధరించి, భుజించి, ప్రవర్తిస్తే భారత దేశ స్థితి ఏదో బాగుపడి పోతుందని ఒక్క క్షణం పాటైనా అనుకోకండి

నీచేతనైనంత వెనుకకు తిరిగి చూడు వెనుక వున్న అనంతమైన వూటనీటిని తనివి తీరా ఆస్వాదించు. అటు తరువాత ముందుకు చూసి, మున్ముందుకు సాగిపో, భారత దేశాన్ని మరింత ప్రకాశవంతమూ, మహోన్నతమూ, మహిమాన్వితమూ చేయి.

గత శతాబ్దంలో సంఘసంస్కర్తలు నిమిత్తం లేవదీసిన అలజడులన్నీ కూడా అలంకార ప్రాయములే. వీటిలోని ప్రతి ఒక్క సంస్కరణా మొట్టమొదట రెండు కులాలనే స్పృశించిందిగానీ మిగిలిన వాటిని కాదు. వితంతు పునర్వివాహం నాటికి డెబ్బైమంది భారతీయ మహిళల వరకు పోనే లేదు. ఇటువంటి ప్రశ్నలన్నీ కూడా బాగా చదువుకొన్న అగ్రవర్ణాల వరకూ పోతాయి. సామాన్య ప్రజలను ఉపయోగించుకొనే, వీరు విద్యాధికులైనారన్న సంగతి విస్మరించకండి. స్వగృహాలను శుభ్రపరచుకోవడానికే సర్వశక్తులూ వినియోగించారు. కానీ యిది సంస్కరణ కాదు

అనాథలు, నిరుపేదలు, నిరక్షరాస్యులైన రైతుజనం, కూలీవర్గాల కోసమే మా ఉద్యమం. వీరికి మొదటగా ఏమైనా [illegible]

ష్యుల కోసం. ఈ రైతాంగాన్ని, కూలీ జనాన్ని ప్రేమతోనే గెలుచుకోవచ్చును "ఎవరి కృషివల్ల వారు పైకి రావాలి". ఇది అన్నిరంగాలకూ వర్తించే సత్యం వారు వృద్ధి పొందేందుకు కృషి చేయడానికి వారికి సాయం చేస్తాము. వారు తమ పరిస్థితిని అర్థం చేసుకొని, తమకు చేయూత, అభివృద్ధి అవసరమున్నాయని గుర్తించిన మరుక్షణం, మీరు చేసే పనియొక్క ప్రభావం వారిపైన కలిగిందన్నమాట. అది కూడా సరైన పద్ధతిలోనే కలిగిందన్నమాట. కర్షక కార్మికులు అవసాన దశలో వున్నారు. వారు తిరిగి తమ శక్తిని పొందడానికి, ధనవంతులైనవారు చేయూతనివ్వాలి. అంతే చాలు అప్పుడు ఆ రైతుజనం, కర్షక కార్మికులు తమ సమస్యలను తామే పరికించుకొని, వాటితో తలపడి పరిష్కారాలు చేసికొంటారు.

తమ సమస్యలను తామే పరిష్కరించుకొనేటంత ఆరోగ్యవంతమూ, శక్తివంతమైన ప్రజాభిప్రాయాన్ని రూపొందించడానికి చాలాసమయం కావాలి ఆ మధ్యకాలంలో మనం వేచియుండాలి, సంఘసంస్కరణ సమస్య యావత్తు యీ మాదిరిగా విభజింపబడుతోంది. సంస్కరణ కావలెననే వారంతా ఎక్కడున్నారు? వారిని ముందుతయారు చేయండి. మనుష్యులు ఎక్కడున్నారు? అల్పసంఖ్యాకుల నియంతృత్వం ప్రపంచంలో కడు హీనమైనది. కొన్ని అంశాలు దోషభూయిష్ఠంగా వున్నాయనుకొనే కొద్దిమంది మనుష్యులు, జాతిని కదిలించలేరు. జాతి ఎందుకు కదలదు? ముందుగా ఒక జాతిని విద్యావంతులను చేసి, శాసనసభను సృష్టించుకో ఆ

తర్వాత చట్టాలు అవే వస్తాయి. ముందు అధికారాన్ని సృష్టించు, అధికారబలం నుండే న్యాయచట్టం ఉత్పన్నమవుతుంది. రాజులు వెళ్ళిపోయారు. ప్రజల నవశక్తి ఎక్కడుంది? దానిని పైకి తీసికొనిరా కాబట్టి సంఘ సంస్కరణలో కూడా మొట్టమొదటి విధి ప్రజలను విద్యావంతులను చేయడం, ఆ సమయం వచ్చేవరకు మీరంతా వేచియుండాలి.

ప్రజలకు స్వయం సహాయకత్వం నేర్పకపోతే ప్రపంచంలోని సర్వసంపత్తి ఏకమైనా, భారత దేశంలోని ఒక్క గ్రామానికి సాయపడజాలదు నైతిక, మేధాసంబంధమైన విద్యను గరపడమే మన ప్రధాన కార్యక్రమమై యుండాలి. విద్య అంటే కొంత విషయ సమాచారాన్ని బుర్రలోకి ఎక్కించి, అది సంపూర్ణంగా జీర్ణం కాక, యావజ్జీవితంలో సంక్షోభాన్ని సృష్టించడం కాదు. జీవన నిర్మాణం చేయగలిగే, మానవులను చక్కదిద్ది శీలాన్ని పెంచగలిగే భావాల ఆకళింపు వుండాలి. నీవొక ఐదు భావాలు ఆకళింపు చేసికొని వాటినే నీ జీవితంగా, శీలంగా స్వంతం చేసికొన్నావంటే చాలు, ఒక గ్రంథాలయం మొత్తాన్ని బట్టీ పట్టిన మనిషి కంటే విద్యాధికుడవైనావని చెప్పవచ్చును. కాబట్టి మన దేశంలోని ఐహిక, ఆముష్మిక విద్య సంపూర్ణంగా మన చేతుల్లో వుంచుకోవడమే మన ఆశయము. ఈ విద్య సాధ్యమైనంత వరకు జాతీయ పద్ధతిలో, జాతీయతా విధానాల్లో వుండాలి.

సామాన్య ప్రజానీకాన్ని విద్యావంతులను చేసినట్లైతే ప్రపంచం నాశనమై పోతుందని అంటూండేవారు. ముఖ్యంగా మనదేశంలో మనకి ఎక్కడ చూసినా చాదస్తపు ముసలివారే కనుపిస్తారు. వారు ప్రతి విషయాన్ని సామాన్య ప్రజల నుండి రహస్యంగా దాచి వుంచాలనుకొంటారు. ఈ విశ్వానికంతకీ తామే అతిగొప్ప మేధావులమనే నిర్ణయానికి వారు వచ్చివేశారు. వారి మాటలు సంఘ శ్రేయస్సు కోసం అంటున్నారా లేక స్వార్థంతో కళ్లు మూసుకొని పోయి అంటున్నారా? కొద్దిపాటి సంపన్నుల సుఖభోగాల కోసమని, లక్షలాది స్త్రీలు, పురుషులు పేదరికపు నరకంలో వుండాలా? అంతులేని అజ్ఞానపు అగాధంలో పడివుండాలా? వారికేగానీ ధనము, విద్య సమకూడినట్లైతే, సంఘం కలవరపడిపోతుందట! సంఘమంటే ఎవరు? లక్షలాది ప్రజలా, లేక నీవూ, నేను, ఉన్నత తరగతి ప్రజలు కొంతమందా? సామాన్య ప్రజల విద్యా మేధాశక్తి వ్యాప్తి చెందిన నిష్పత్తిలోనే జాతి ముందుకు సాగుతుంది. మనం పునరుద్ధరింపబడవలెనంటే సామాన్య ప్రజలలో విద్యావ్యాప్తి జరపాలి. సామాన్య ప్రజలకు విద్య నేర్పించి, వారిని ఉద్ధరించు. అప్పుడే ఒకజాతి ఏర్పడుతుంది. మన సంస్కర్తలు కూడా లోపము ఎక్కడుందో గుర్తించలేదు.

విద్య కావాలి, విద్యే కావాలి, విద్య మాత్రమే కావాలి! యూరోపులోని అనేక నగరాలలో పర్యటించి,
[illegible] కూడా మనటువంటి విద్యా సౌకర్యాలు

పరిశీలించి, మన దేశ ప్రజల స్థితి మనస్సులో మెదలి నేను కన్నీరు కార్చేవాడను తేడా ఎందుచేత వచ్చింది అని ప్రశ్నించుకుంటే, విద్య వల్ల అన్న సమాధానం నాకు తోచింది

వెనుకబడిన తరగతులవారికి మనం చేయవలసిన వ్యక్తిక కార్యక్రమం ఏమిటంటే, వారికి విద్యనివ్వడం, కోల్పోయిన వ్యక్తిత్వాలను పెంపుచేయడం, వారికి భావాలు మనం యివ్వాలి. చుట్టూ లోకంలో జరిగే దానిని గురించి వాళ్ళ కళ్ళు తెరిపించాలి. అప్పుడు తమ ముక్తి మార్గము తామే ఏర్పాటు చేసికొంటారు ప్రతి జాతి, ప్రతి స్త్రీ, ప్రతి పురుషుడు ఎవరి విముక్తికి వారే బాటలు వేసుకోవాలి. వారికి ఆలోచనల నివ్వండి వారికి కావలసినది అదొక్కటే సహాయం. మిగిలినదంతా దానంతటదే సమకూడుతుంది రసాయనాల నన్నిటినీ ఒకచోట కుప్పపోయడమే మన పని. ప్రకృతి ధర్మం ప్రకారం స్ఫటికీకరణం అదే జరుగుతుంది వారి బుర్రల్లో భావాలను ప్రవేశపెట్టడమే మనపని. మిగిలినదంతా వారే సాధించుకొంటారు. ఇదే మనం భారతదేశంలో చేయవలసింది.

మన దేశంలోని సామాన్య ప్రజలందరినీ చేరుకోవడమే నా పథకం. మనం మన ప్రాచీనులు నిర్దేశించిన పద్ధతిని అనుసరించాలి, అంటే ఆదర్శాల నన్నిటినీ క్రమేణ మామూలు ప్రజానీకం స్థాయి వరకు తీసికొనిపోవాలి. వారిని నిదానంగా

మతం ద్వారా సర్వసమానత్వానికి సంబంధించిన జ్ఞానాన్ని కూడా వారికి బోధించండి

పేదవారి కోసం దేశం మొత్తాన పాఠశాలలు ఒక వేళ ప్రారంభించామనుకోండి. ఐనప్పటికీ వారందరికీ విద్య నందించలేము. అసలది ఎల్లా సాధ్యమౌతుంది? నాలుగేళ్ళ పిల్లవాడు కూడా నాగలి పుచ్చుకొని పొలానికైనా పోతాడు, పనిలోకైనా వెళ్తాడు మనబడికి రావడం కంటే అది మంచిది వాడికి. మహమ్మదు దగ్గరికి కొండ రాదు గనుక, కొండ దగ్గరకు మహమ్మదు వెళ్లాలన్నది సామెత. మరి విద్యాపథకమే ఇంటింటికీ ఎందుకని వెళ్ళరాదు అంటాను నేను. నాగలి దున్నేవాని కొడుకు చదువుకోవడానికి రాలేక పోతే నాగలి వున్నచోటనే అతడిని కలుసుకోండి. ఫ్యాక్టరీ లోనైనా సరే వెళ్ళి కలుసుకోవాలి. అతని నీడవలె వెన్నంటి నడవండి

పేదవారికి మనం ఏర్పాటు చేసే విద్య చాలవరకు మౌఖికమై వుండాలి ఇంకా పాఠశాల విద్యకు సమయం రాలేదు ఒక విధి ప్రోగుచేయడానికి ప్రయత్నించండి. మాయాలాంతర్లు, దేశపటాలు, భూగోళ నమూనాబొమ్మలు, కొన్ని రసాయనాల్లు కొనండి ప్రతి సాయంత్రం పేదవారిని, నిరుపేదవారినైనా సరే ప్రోగుచేయండి. ముందుగా మతం గురించి వారికొక ఉపన్యాస మివ్వండి మాయా లాంతరు మొదలైనవి ఉపయోగించి వారికి జ్యోతిశ్శాస్త్రం, భూగోళం మొదలైనవి బోధించండి.

ఇప్పుడు మీ విధి ఏమిటంటే దేశంలో ఒక మూల నుండి మరొక మూలకు పర్యటించడం, ఒక గ్రామం నుండి మరొక గ్రామానికి పర్యటించడం, సోమరితనంగా కూర్చోవడం యింకెంత మాత్రం తగదని ప్రజలకు చెప్పడం— యివే మీ విధులు. వారి నిజస్థితి ఏమిటో వారికి అవగత మయ్యేటట్లు చెప్పి— "ఓ సోదరులారా మేల్కొనండి. మరెంత కాలం నిద్రపోతూ వుంటారు!" అని హెచ్చరించండి. తమ స్థితిని వారెల్లా మెరుగు పఱచుకోవాలో సలహానిచ్చి, మత గ్రంథాలలోని పవిత్ర సత్యాలను సులభమైన తీరులో ఆకర్షణీయ పద్ధతిలో వారు అవగాహన చేసికొనేటట్లు చెప్పండి మతం మీద, వారికి కూడా బ్రాహ్మణుల కున్నంత హక్కు వున్నదనే భావం వారిలో నాటుకొనేటట్లు చెప్పండి, చండాలురతో సహా ప్రతి ఒక్కరికీ మంత్రోపదేశం చేయండి. మామూలు మాటలలో వారికి జీవితావసరాలను గురించి, వ్యాపారం, వాణిజ్యం, వ్యవసాయం గురించి చెప్పండి

ప్రజలకు కొంత సాంకేతిక విద్య వస్తే మంచిది దాని వల్ల వారికి పని దొరుకుతుంది. వృథాగా కాలం పాడుచేసికొంటూ, ఎవరేనా సాయం చేయాలని ఎదుస్తూ వుండే బదులు తమ తిండి తాము సంపాదించుకొనగలుగుతారు సామాన్య ప్రజలు జీవన పోరాటాన్ని ఎదుర్కొనడానికి సన్నద్ధపరచ నటువంటి చదువులు, వారి శీలసంపన్నతను పెంచని చదువులు, దాతృత్వ లక్షణాన్ని బహిర్గతం చేయని చదువులు ఎందుకు పనికివసాయి? శీలసంపదను మాపొందించేటువంటి,

గుండె నిబ్బరాన్ని పెంచేటువంటిదీ, మేధాజ్ఞానాన్ని విస్తృత పరచేటువంటిదీ, స్వయంశక్తిని కలిగించేటువంటిదీ, అయిన విద్య కావాలి మనకు

మన దేశంలో పురుషులకు, స్త్రీలకు మధ్య యింత విభేదం ఎందుకున్నదో అర్థం చేసికోవటం చాల కష్టం మన వేదాంతం సర్వప్రాణులలోను ఒకే ఆత్మ వున్నదని ఉద్ఘాటిస్తోంది. ఎప్పుడూ స్త్రీలను విమర్శిస్తూ, ఆ విమర్శ వారి సముద్ధరణకే అంటూ వుంటాము.

స్త్రీలకు సముచిత గౌరవమివ్వడం ద్వారానే అన్ని జాతులూ గొప్పదనాన్ని పొందాయి. స్త్రీలను గౌరవించని జాతి, దేశం ఎన్నడూ మహిమాన్వితం కాలేదు, భవిష్యత్తులో కాబోవు కూడా. దేవి అంశము మూర్తీభవించిన స్త్రీలను మీరు ఔన్నత్యానికి తీసికొని రాలేకపోతే, మీకు ఉత్తమగతి పొందే మార్గాంతరం వున్నదని భావించకండి

స్త్రీలకు అనేకములైన విషమ సమస్యలున్నాయి. కానీ వీటిల్లో ఏవీ కూడా 'విద్య' అనే విచిత్ర పదం వల్ల సాధింపబడనివి కావు ముందుగా మీ ఆడవారికి చదువు చెప్పించి, వారి మానాన వారిని వదలి వెయ్యండి తమకు ఏ సంస్కరణలు అవసరమో వారే మీకు చెబుతారు. తమ సమస్యలను తమ స్వంత పద్ధతిలో పరిష్కరించుకొనడానికి అనువైన పరిస్థితిలో స్త్రీలనుంచాలి. మహిళల సమస్యలను

తీర్చడానికి మీరెవరు ? మీరు ప్రత్యక్షదైవాలా ? జాగ్రత్త, వారి జోలికి పోకండి

మతం కేంద్రంగా, స్త్రీ విద్యావ్యాప్తి జరగాలి. అన్ని రకాల శిక్షణలూ, మతం తర్వాతనే వుండాలి. ఆధ్యాత్మిక శిక్షణ, శీల నిర్మాణం, బ్రహ్మచర్య దీక్షా పాలన—వీటిని అమలు పరచేట్లు చూడాలి.

సీతాదేవి అడుగుజాడల్లో భారతీయ మహిళలు పెరిగి, అభివృద్ధి చెందాలి. అదొక్కటే మార్గం సీతాదర్శనం నుండి దూరం చేసేందుకు పయత్నించే ఏ ఆధునికీకరణమైనాగానీ వెంటనే విఫలమౌతుంది, ఇది మనం రోజూ చూస్తున్నదే

మన హిందూ వనితలకు పాతివ్రత్యమనేది అతి తేలికగా అర్థమౌతుంది. ఎంచేతంటే అదే వారి వారసత్వం. మున్ముందుగా అన్నిటికంటే మిన్నగా వారిలో యీ ఆదర్శాన్ని తీవ్రతరం చేయండి. దీనివల్ల వారి శీలం శక్తివంతమౌతుంది. శీలసంపద వల్ల వారు జీవితంలోని ప్రతిఘట్టంలో-వారు వివాహితలు కానివ్వండి, అవివాహితలుగా వుండాలని యిష్టపడనివ్వండి - ఏ స్థితిలోనైనా సరే. తమ పవిత్రతను కోల్పోయేందుకు అంగుళమైనా కదలరు. ప్రాణాలనైనా ధారపోయడానికి సిద్ధపడతారు.

దీనితోపాటుగా వారికి భౌతిక శాస్త్రాలు, విజ్ఞాన శాస్త్రాలు మొదలైన-అంశాలు కూడా నేర్పించాలి. అవి వారికీ యితరులకీ కూడా ప్రయోజనకరంగా వుంటాయి.

మన దేశ స్త్రీల జీవితం యీ విధంగా మలచబడి నట్లయితేనే, సీత, సావిత్రి, గార్గివంటి ఆదర్శమూర్తులు పునఃసాక్షాత్కరిస్తారు

స్త్రీలు ఉన్నతిని అందుకొంటే వారి పిల్లలు కూడా తమ ఉదార ప్రవర్తనతో దేశకీర్తిని యినుమడింపచేస్తారు. అప్పుడే సంస్కృతి, విజ్ఞానమూ, శక్తి, భక్తి, శ్రద్ధలు దేశంలో జాగృతమౌతాయి.

వినాశం తగదు. విగ్రహ విధ్వంసన చేసే సంస్కర్తలు ప్రపంచానికి ఏమీ మేలు చేయలేరు దేనినీ భంగం చేయవద్దు దేనినీ నేలకు కూలగొట్టవద్దు నిర్మాణం చేయండి. చేతనైతే సాయం చేయండి అది చేతకాకుంటే చేతులు ముడుచుకొని, వారగా నిలబడి, జరుగుతున్నదానిని అవలోకించండి సాయం చేయడం చేతకాకపోతే మానె, హాని చేయవద్దు. మనిషిని ఉన్నచోటే స్వీకరించి, అక్కడనుండి అతని ఉన్నతికి చేయూతనివ్వండి మీరూ, నేనూ ఏం చేయగలం? ఒక్క చిన్న పాపకైనా కనీసం మనంఏదైనా నేర్పగలమా! మీ చేతకాదు. శిశువు తనకు తానే నేర్చుకొంటాడు. అవకాశాలు కలుగచేయడం, అవరోధాలు తొలగ ద్రోయడమే మీ విధి.

ప్రతి ఒక్కరి గృహద్వారము కడకు విశాల భావాలు తీసికొని వెళ్ళి అందచేసే ఒక యంత్రాంగాన్ని నెలకొల్పి సాగింపచేయాలన్నదే నా జీవితాశయము. అప్పుడు ప్రతి స్త్రీ, పురుషుడు, తమ అదృష్టాన్ని తామే నిర్ణయించుకొంటారు.

"జీవితానికీ, అభివృద్ధికీ, శ్రేయస్సుకూ, ఆలోచనలో ఆచరణలో స్వేచ్ఛ అత్యవసరం." ఇవి లేనిచోట మనిషి, జాతి, దేశం కూడా అధోగతికి జారవలసినదే. మనిషికి ఏ విధంగానైతే ఆలోచించుకోవడానికీ, మాటలాడడానికీ స్వేచ్ఛ అవసరమో, అదే విధంగా ఆహారం, వేషధారణ, వివాహాది ప్రతి విషయంలోనూ స్వేచ్ఛ అవసరం అయితే అతడు యితరులకు హాని చేయనంతకాలం. యీ స్వేచ్ఛ వుండాలి.

మనకు శక్తి కావాలి. బలహీనతను కుదర్చవలెనంటే, ఆ బలహీనతను గురించి దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చోవడం కాదు. బలాన్ని గురించి ఆలోచించాలి మనదేశానికి యీనాడు కావలసినవి ఇనుప కండరాలు, ఉక్కునరాలు, దేనికీ లొంగని బ్రహ్మాండమైన సంకల్పం కడలి అట్టడుగుకి పోవలసివచ్చినా, మృత్యువునే ముఖాముఖి ఎదుర్కొనవలసి వచ్చినా వెనుదీయక తమ లక్ష్యాన్ని సాధించేటువంటి, విశ్వ గర్భంలోని రహస్యాలను ఛేదించగలగనటువంటి లక్షణాలే యీనాడు మనకు కావాలి. శక్తిని పొందడానికి ప్రప్రథమ సోపానం ఉపనిషత్తులను గౌరవించి. "అహంబ్రహ్మాస్మి" అని విశ్వసించడమే యావత్ప్రపంచాన్నీ బలసంపన్నం చేయుగల శక్తి యిందులోనే వున్నది. శతాబ్దాల తరబడి ప్రజలకి హీనసిద్ధాంతాలు బోధించడం జరిగింది ఆత్మ గురించి వారిని విననివ్వండి. నిమ్నజాతులలో అతిహీనులైన వారిలో కూడా ఆత్మ అనేది వున్నదనీ, అది చావులేనిదనీ, పుట్టుకే లేనిదనీ వారిని విననివ్వండి

నేను అనుభవం మీద ఒక సంగతి తెలిసికొన్నాను అదేమిటంటే — మన పవిత్ర మతగ్రంథాలు చెప్పినట్లు, విభేదాలున్నచోటనల్లా దౌష్ట్యం పుడుతుందనీ, సర్వవిషయాలలో అంతర్లీనంగా నున్న ఏకత్వం, సరిసమానత్వాలలో విశ్వాసమున్న చోటనల్లా మంచి పుడుతుందనీ నేను తెలిసికొన్నాను అనర్థమూ, అజ్ఞానమూ వున్నచోటనల్లా యిదే నేను గ్రహించాను ఇదే వేదాంత పరమార్థం. వేదాంతంలోని యీ భావాలు వెలికి రావాలి అవి అడవులలోను, గుహలలో వుండడమే కాక, న్యాయస్థానాల్లో, న్యాయవాదుల కార్యాలయాల్లో, మతపీఠాలలో, పేదవాని కుటీరానికి దగ్గరగా, చేపలుపట్టే బెస్తవారి దగ్గరగా, చదువుకొంటున్న విద్యార్థుల దగ్గర—ప్రతిచోటా వుండాలి యీ భావాలు ఏవృత్తిలో వున్నా, ఎక్కడవున్నా ప్రతి పురుషుడినీ స్త్రీనీ, శిశువునీ పిలుస్తాయి యీ వేదాంత భావాలు వాటిని స్వీకరించండి వాటిని మెరుగుపరచండి అప్పుడు భారతదేశ విముక్తి కరతలామలకం అవుతుంది ప్రకృతిలో అసమానత్వమున్నప్పటికీ ప్రతివారికీ సమానావకాశాలు దొరకాలి కొందరికి అవకాశాలు అధికంగానూ, మరికొందరికి తక్కువగానూ వుంటే, బలహీనులకు—బలవంతులకంటే ఎక్కువ అవకాశం దొరకాలి. మరో మాటలో చెప్పాలంటే, బ్రాహ్మణునికి, చండాలునకున్నంతగా విద్యావశ్యకత లేదు బ్రాహ్మణ శిశువుకు ఒక్క అధ్యాపకుడు సరిపోతాడనుకుంటే, చండాలుని సంతానానికి పదిమంది ఉపాధ్యాయులు కావాలి.

జన్మతః ప్రకృతి నిశితబుద్ధిని ప్రసాదించనటువంటి వానికి అధికంగా చేయూత కావాలి.

ఈ మనుష్యులను ఉద్ధరించాలి. విశ్వాసపూరితాలైన వచనాలు వారికి చెప్పాలి "మీరూ మావంటి మనుష్యులే. మాకున్న హక్కులన్నీ మీకూ వున్నాయి" అని వారికి చెప్పాలి

ఉన్నతిలో వుండేవారిని క్రిందికి దిగలాగడం పరిష్కారం కాదు. క్రిందనుండే వారిని పైకి లేవనెత్తడమే పరిష్కారం ఒకకొసని ఆదర్శం బ్రాహ్మణుడు, మరొకకొసని చండాలుడున్నాడు. మన మొత్తం కృషి చండాలుణ్ణి బ్రాహ్మణుని స్థాయికి తీసికొని వెళ్ళడం కోసమే పై కులాల వారికి బలమిచ్చే చదువుని, సంస్కృతిని క్రింది వారికి కూడా అనువర్తింపచేయడమొక్కటే కులాల అంతరాలను తగ్గించడానికి మార్గం

పేద రైతులకూ, కార్మికులకూ, ధనిక వర్గాలకూ ఒకరికొకరి మధ్యవర్గ పోరాటం ఆరంభింప చేయకుండా మీరు జాగ్రత్త పడాలి.

ప్రత్యేక సౌకర్యమనే భావమే మానవ జీవితానికి అనర్థదాయకం. ప్రత్యేక సదుపాయాలనే వాటిని భగ్నపరిస్తేనే, ఒక జాతికి మరింత ప్రకాశమూ, ప్రగతీ ఒనగూడుతాయి ఎవ్వరికీ ఎటువంటి మినహాయింపు, సౌకర్యం పనికి

కొందరు మనుష్యులు తమ అభిరుచులని బట్టి యిత రుల కంటే ఎక్కువ సంపదను వెనక వేస్తారన్నది సహజ విషయమే అయితే ధనార్జనశక్తిని బట్టి, తమంతగా ధనం సంపాదించలేని వారి పైన స్వారీచేసి, బాధలు పెట్టాలన్నది ధర్మసమ్మతం కాదు. ఈ అధర్మం మీదనే పోరాటం జరుగుతూ వున్నది ఒకరి కంటే మరొకరు అధికంగా సౌకర్యాలు అనుభవించడమనేది ప్రత్యేకత కిందకు వస్తుంది యుగయుగాలుగా యీ పద్ధతిని నిర్మూలించడమే నైతిక ధర్మంగా భావింపబడుతోంది వైవిధ్యాన్ని నాశనం చేయకుండా ఏకత్వాన్ని, ఐక్యతనూ సాధించే ప్రయత్నమే యీ కార్యక్రమం. ప్రత్యే సౌకర్యాలనూ, వాటికొరకు కృషి చేస్తున్న ప్రతి యత్నాన్నీ నేలరాచి, మానవులంతా ఒకటే ననే భావాన్ని పాదు కొలిపే ప్రజ్ఞానం కొఱకు కృషిచేద్దాం.

తన గుల్లలోకి తాను ముడుచుకొనిపోయే ముత్యపు సీపి చెపలా యీ దేశం సంకుచితమై, తన అమేయాభరణాలను, సంపదలను యితర మానవజాతులకు యివ్వకుండా వుండడమే యీ భారత దేశ దైన్యానికి ఒకానొక కారణం.

ఇచ్చి పుచ్చుకోవడంలోనే ధర్మం ఇమిడి వున్నది. భారతదేశం పునరౌన్నత్యాన్ని పొందవలెనంటే, తన అమేయ సంపదను వెలికి తీసి, భూమి మీది యితర జాతుల కి.గి. వారు తనకివ్వగలిగిన వాటిని పుచ్చుకోవడం అత్యంత

వసరం. సువిస్తృతం కావడమే జీవితం, సంకోచించుకొన డమే మృత్యువు ప్రేమయే జీవితం, ద్వేషమే మృత్యువు.

మనకు కావలసినది వేదాంతం జోడించిన పాశ్చాత్య దేశాల శాస్త్రీయ విజ్ఞానం బ్రహ్మచర్యమే మనకు దారి చూపే దీక్షావాక్యం కావాలి అందుకు శ్రద్ధ, ఆత్మవిశ్వాసం జతపడాలి.

స్వేచ్ఛా సమానత్వ భావాలలో, శ్రమ, శక్తికి సంబంధించిన విషయాలలో పాశ్చాత్యుడవై పోయి, అదే సమయంలో మత సంస్కృతి సహజ ప్రకృతి విషయాలలో అత్యుత్తమ హైందవుడవై పోగలవా! సోమరితనపు ప్రేలాపనలతో శక్తిని వృధా పుచ్చకుండా, నాయకులపట్ల అవిలంబ విధేయత చూపడం, ఈసులేక పోవడం, అజేయమైన దీక్షాస్వభావం, అమరమైన ఆత్మవిశ్వాసం— ఈ లక్షణాలను ఆంగ్లేయుని నుండి నేర్చుకోవడం అత్యవసరం

ప్రతి ఒక్కరూ మరి ఒక్కరిని శాసించె ముందు కాను విధేయులై లొంగడం నేర్చుకోవాలి ఈర్ష్యా రాహిత్యం, నేతలకు విధేయత ప్రతి ఒక్క హైందవుడూ అభ్యసించనిదీ మనలో కూడగట్టుకొని వచ్చే శక్తివుండదు... భారతదేశం యూరోపునుండి బాహిర విజయాలను నేర్చుకొనవలసియుండగా, యూరోపుదేశం భారతదేశం నుండి అంతః ప్రకృతి విజయాలను గురించి నేర్చుకోవలసియున్నది. మనం

మరొక భాగాన్ని సాధించారు ఈ రెంటి కలయికే మనకు కావలసినది

ప్రతి మానవుణ్ణి మహోన్నతుడిని చేయడానికి ప్రతి దేశాన్ని మహోత్కృష్టం చేయడానికి మూడు అంశాలు అవసరం

1 సద్వర్తనశక్తి గురించిన విశ్వాసం

2. ఈర్ష్య అనుమానాలు లేకుండా ఉండటం

3. దయాశీలురైన వారికి, దయగానుండ దలచుకొన్న వారికి సహకార మివ్వడం

మున్ముందుగా యీర్ష్య అనే మచ్చను తుడిచి వేద్దాం ఎవ్వరిని చూచి యీసు చెందవద్దు మంచిని పెంచే ప్రతి కార్యకర్తకూ చేయూత నివ్వడానికి సిద్ధంగా ఉందాం. ముల్లోకాలలోని ప్రతి జీవికీ ఒక శుభాకాంక్షను పంపిద్దాం. విశాల దృక్పథం అలవర్చుకోవడం. విశాల ప్రపంచంలోకి వెళ్ళి సమైక్యమైన విశ్వభావనను సాధించడమే మన ఆశయాల ధ్యేయం. ప్రేమ, నిజాయతీ. ఓరిమి, యివి తప్ప మరే లక్షణాలు అవసరం లేదు

గుండెల్లో అంతులేని సాహసం, అజేయమైన శక్తి - వీటితో కూడిన తీక్ష్ణ కర్మయోగం కావాలి యిప్పుడు

నామాటంటే, మీకు ఏమైనా విలువవుంటే-నే నొక సలహా యిస్తాను. మీ గృహ కవాటాలను, ద్వారాలను తెరచి వేయండి! మీ వాటాలో పతనావస్థలో, దుఃఖంలో

పేదవారు కుప్పలుగా పడివున్నారు వారి దగ్గరకు వెళ్ళి, ఉత్సాహంతో, పట్టుదలతో సేవచేయండి జబ్బుపడిన వారికి మందులివ్వండి యావచ్ఛక్తితో వారికి ఉపచర్య చేయండి. తిండిలేక మాడిపోతున్న వారికి ఆహారం సరఫరా చేయండి. అజ్ఞానులైన వారికి మీలో వున్న జ్ఞానం మేరకు బోధనలు చేయండి పవిత్ర భావంతో ఉజ్వలితమై, భగవంతునిలో అమరమైన విశ్వాసం కలిగి. దీన పతిత మానవులపట్ల అపార కరుణతో, సింహసదృశ శక్తి సాహసాలను పుంజుకొని లక్షలాది స్త్రీలు పురుషులు యీ దేశం యీ కొస నుండి ఆ కొసవరకు ప్రయాణం సాగిస్తారు. వారు నిర్వాణ శుభ సందేశాన్ని ప్రసారం చేస్తారు సహకార మంత్రాన్ని, సాంఘిక పథోన్నతి మార్గాన్ని, సర్వసమానతా సూత్రాన్ని బోధిస్తారు వారు

నానాటికీ దిగజారి, దుఃఖదారిద్ర్య అజ్ఞాన తిమిర లోకంలోకి కూలిపోతున్న లక్షలాది స్వదేశీయుల సంక్షేమం కోసం, విశాల హృదయులైన వందలాది స్త్రీ పురుషులు, జీవిత సుఖానుభవ కాంక్షలను విడచిపెట్టి, తమ ప్రత్యణువును ధారపోసి శ్రమించినప్పుడే భారత దేశం జాగృత మౌతుంది.

నాలుగవ అధ్యాయం

## ఎప్పుడూ ముమ్ముందుకే!

మీరు భగవంతుని సంతతివారు అనశ్వరానందాన్ని పంచుకొనే పవిత్ర, నిర్దుష్ట జీవులు మీరు బలహీనులమని అనరాదు నిలబడండి, ధైర్యంగా, బలంగా నిలబడండి! మొత్తం భారాన్ని మీ భుజాలపైకి ఎత్తుకొనండి మీ భాగ్య విధాతలు, సృష్టికర్తలు మీరేనని తెలిసికొనండి మీకు కావలసిన బలం, సహాయమూ మీలోనే నిండి వున్నది

బ్రాహ్మణేతరులకు నేనొకటే చెబుతాను, వేచి యుండండి, త్వరపడకండి' అని. బ్రాహ్మణులతో పోరాడేందుకు దొరికిన ప్రతి అవకాశాన్ని చేజిక్కించుకోకండి ఎందుకంటే మీలో నాలో పాలలోనే మీరు బాధపడుతున్నారు. వార్తాపత్రికలలో వ్యర్థ వాదనలతో. కీచులాటలతో మీ శక్తిని వృధా పుచ్చకుండా, మీ గృహాలలో మీరు దెబ్బలాడుకోకుండా మీ సర్వశక్తులనూ బ్రాహ్మణునియున్న సంస్కారాన్ని పొందడానికి వినియోగించుకోండి దీనితో మీరు అంతా సాధించినట్లే.

భారతదేశంలోని ఉన్నత వర్గీయులారా మీరింకా సజీవంగా వున్నామనే భావించుకొంటున్నారా? సువాసన ద్రవ్యాలలో నిలువచేయబడిన పదివేల సంవత్సరాలనాటి పీనుగలు మీరు! మీ పూర్వీకులు నడచే 'కుళ్లు మాంసపు

జీవులుగా' ఎవరినైతే వర్ణించారో వారిలోనే భారత దేశంలో వున్న కాస్త జీవము మిగిలి వున్నది మీరే అసలు సిసలైన నడచే ప్రేతాలు, ఓహో, మీ ఎముకల వ్రేళ్ళమీద అమూల్యాలైన అంగుళ్యాభరణాలు వున్నట్లున్నాయి. ఇవి మీ పూర్వీకులు మీ కోసం దాచి వుంచిన సంపదలు. దుర్వాసన కొడుతున్న మీ శవపరిష్వంగంలో భాగ్యపేటికలు మరిన్ని దాచివుంచబడినాయి. వాటిని మీ వారసులకు సంక్రమింపచేయండి వీలైనంత శీఘ్రగతిన ఆ పని చేయండి. మీరు శూన్యంలో విలీనమై, అంతర్ధానమై పోండి మీ స్థానంలో నవభారతం ఉదయించనివ్వండి

ప్రజాబాహుళ్యం మేల్కొనినప్పుడు, మీరు వారిని పీడించిన సంగతిని అర్థం చేసుకొంటారు. వారు గట్టిగా ఊదితే చాలు మీరు సమూలంగా ఎగిరిపోతారు మీలో నాగరికతను ప్రవేశపెట్టిన వారు వారే వారే దానిని కూల ద్రోసివేస్తారు కాబట్టి, నిమ్నజాతివారికి పాండిత్యం, సంస్కృతీ నేర్పి గాఢనిద్రనుండి మేల్కొల్పండి వారు మేల్కొనినప్పుడు ఏదో ఒకనాడు వారు మేల్కొంటారు- మీరు వారికి చేసిన సేవలను మర్చిపోక మీకు సదా కృతజ్ఞులై వుంటారు

గొప్ప వంశస్థులైన ప్రభువులందరి కర్తవ్యమూ ఏమిటంటే తమ గోతులను తామే త్రవ్వుకోనడం. ఆ పని వారెంత త్వరగా చేస్తే అంత మంచిది. అది వారెంత ఆలస్యం చేస్తే

అంతగా పుంజయిపోయి, నికృష్టపు చావు పాలవుతారు. కాబట్టి భారత దేశంలోని తతిమ్మా వారందరి విముక్తికోసం పాటుపడటమే బ్రాహ్మణుని విధి నిరంతరం లక్షల ప్రజలు ఆకలిలో, అజ్ఞానంలో మగ్గిపోతుండగా వారిని కొల్లగొని, తాను విద్యాధికుడై కూడా వారిని గురించి కనీసమాత్రంగానైనా పట్టించుకోని వాడిని నేను 'నమ్మకద్రోహి' అంటాను.

పేదవారిని పీడించి పిండిచేసి వారినుండి సొమ్మును సంగ్రహించి తాము గొప్పవారై సింగారం చేసికొని తిరుగుతున్నవారిని నేను నీచులంటాను తిండిలేక అడవి జంతువులవలె జీవించుతున్న ఈ ఇరవై కోట్లమంది నిరుపేదల కోసం ఏమీ చేయని గొప్పవాడిని నేను 'దౌర్భాగ్యుడు' అనే అంటాను

ఆత్మవత్సర్వభూతాని - నీవలెనే సమస్త జీవులు అనే బోధన గ్రంథాలకే పరిమితం కావలెనా? ఆకలిగొన్న కడుపులకు పిడికెడు అన్నం పెట్టనివారు మోక్షాన్ని ఎలా ప్రసాదించగలరు? ఇతరుల గాలి సోకితేనే మలినమైపోయే వారు యితరులను పవిత్రులనెలా చేయగలరు? - అంటరానితనమనేది ఒక విధమైన మనోవ్యాధి

లేచి మీ పౌరుషాన్ని ప్రదర్శించండి—ఒక యజమానివలె కాదు అంధవిశ్వాసాలు జిలజిలమంటున్న రాచపుండు లాంటి అహంభావి వలె కాదు. ప్రాక్పశ్చిమాల రహస్యాలు తెలిసిన కువైద్యునివలె కాదు, కేవలం ఒక సేవకునివలె నీ పౌరుషాన్ని ప్రదర్శించు.

ఒక సంఘంలోని సభ్యులందరికీ సంపద, విద్య, జ్ఞానం సంపాదించుకోనడానికి సమానమైన అవకాశం వుండాలి. అన్ని విషయాలలోనూ స్వేచ్ఛ అంటే ముక్తిమార్గంలో ప్రగతి గాంచేందుకు మనిషి సంపాదించగలిగిన మహోన్నత ప్రయోజనమే స్వేచ్ఛ ఈ స్వాతంత్ర్యవికాసానికి అడ్డువచ్చే సాంఘిక నిబంధనలన్నీ హానికరములు. వాటిని అతిశీఘ్రంగా నాశనం చేయడానికి చర్యలు తీసికోవాలి. మానవులు స్వేచ్ఛా పథంలో ముందడుగు వేయడానికి అవసరమైన వ్యవస్థలను పోత్సహించాలి

ప్రతి విషయంలోను ప్రథమ తాంబూలం పేదలకే అందాలి మిగిలిన దానిపైనే మనకు హక్కు. ప్రథమ పూజ విరాట్టుకే మన చుట్టూవున్న ఆ స్వరూపాన్ని పూజించు "వర్షిప్" - ఆరాధించు అనేదే సరైనమాట ఇతర ఆంగ్ల పదాలేవీ సరిపోవు వీరం[illegible] దేవతలు - మనుష్యులు జంతువులు. మనం ముందుగా ఆరాధించవలసిన ప్రత్యక్ష దైవాలు మన దేశ ప్రజలే జాగృతమైయున్న దైవాలు వీరే. మన జాతీయులే "ప్రతి తావునా అతని కరములే ప్రతి అడుగునా అతని పదములే, ప్రతి శ్రుతిలో అతని వీనులే అంతటా అతడే నిండివున్నాడు, ఇతర దైవాలన్నీ నిద్రపోతూ వున్నాయి శుష్క దైవాలవైపు పరుగిడడం దేనికి? మన కళ్ళెదుట వున్న విరాట్స్వరూపమైన భగవంతుణ్ణి ఎందుకు

ప్రతి పురుషుణ్ణీ, స్త్రీనీ, ప్రతి జీవినీ దైవంగా చూడండి అత్యంతనిష్ఠను పాటించిన అనంతరం, నేను ప్రతి జీవిలోను భగవంతుడున్నాడనే పరమ సత్యాన్ని కనుగొన్నాను అది వినా వేరు దైవము లేదు "జీవాత్మ సేవ చేసేవాడు పరమాత్ముని సేవించినట్లే" ప్రత్యక్ష దైవమైన నీ సోదర మానవుణ్ణి పూజించలేనివాడవు ప్రత్యక్షం కాని పరమాత్ముడిని ఎల్లా పూజించగలవు? భగవంతుని ఆరాధనకు నీవొక దేవాలయాన్ని నిర్మించవచ్చు, మంచిదే కావచ్చు. కానీ, అంతకంటే ఉన్నతమైనదీ, ఉత్తమమైనదీ యిప్పటికే నిర్మితమై వున్నది - అదే మానవ హృదయం

మీరు మీ దేహాన్ని, మనస్సునీ, వాక్కునీ విశ్వ సంక్షేమం కోసం ధారపోయాలి. "మాతృదేవో-భవ, పితృదేవోభవ' అని చదివే వున్నారు-తల్లిని దైవంగా భావించు. తండ్రిని దైవంగా భావించు అని కానీ-నే నంటాను, "దరిద్ర దేవో భవ, మూర్ఖదేవో భవ" అని. నిరుపేదలూ, నిరక్షరాస్యులూ, అజ్ఞానులూ, బాధితులూ - వీరే మీ దైవాలు కావాలి - వీరికి సేవచేయటమే అత్యున్నత మతమని గ్రహించండి

భారత దేశంలోని అత్యున్నతుల, అత్యుత్తముల త్యాగమే యీ దేశానికి అవసరమని నాకు ఖచ్చితంగా తెలుసును. లోకంలో అతిసాహసవంతులు, అత్యుత్తములైన మానవులు అనేకుల మేలు కోసం, సర్వుల సంక్షేమం కోసం

ఆత్మత్యాగం చేయాలి అనంత ప్రేమతో కరుణతో నిండిన బుద్ధులు శతాధిక సంఖ్యలో అవసరమున్నారు

పురుషులు కావాలి మనుష్యులు కావాలి మిగిలినవన్నీ సిద్ధంగానే వుంటాయి కానీ బలవత్తులైన తేజోవత్తులైన విశ్వాసం కలిగి నిజాయితీ నిండిన యువకులు కావాలి ఇటువంటి మరో వందమంది వుంటే లోకమే విప్లవితమై పోతుంది మనం ముందు వారికి జీవపథం ఏర్పరచాలి అప్పుడు కొంత ఖచ్చితమైన పని జరుగుతుందని ఆశించవచ్చు

భారతదేశ సామాన్య ప్రజలను ఉద్ధరించాలనే ఏకైక దీక్షతో హృదయ ఆత్మకూడా నిమగ్నం చేయగల నవ యువకుల మధ్య పనిచేయండి వారిని మేల్కొల్పండి దీక్షా పరచండి ప త్యాగభావం వారిలో ప్రొదుకొలపండి ఇది తా సంపూర్ణంగా భారత యువకుల మీదనే ఆధారపడివున్నది

నేను ఈ యువకులను సంఘటిత పరచడానికే జన్మనెత్తాను కాదు ప్రతి పట్టణంలోనూ వందలాదిమంది నాతో కలవడానికి సిద్ధంగా వున్నారు వీరిని నేను అపరాని అలలవలె దేశంలో ప పదలచాను వారు కడుపేదవారి సేద దీరుస్తారు వారి గృహాంగణలో మతాన్ని నైతిక శక్తిని విద్యను తీసుకొనిపోతారు నేనిది సాధిస్తాను లేదా సమసిపోతాను

ఓ మహాత్ములారా లేవండి నిద్రలేవండి లోకం శేమితో తగులబడిపోతున్నది మీరు నిద్రపోగలరా దీర్ఘనిద్రలో వున్న దేవతలు మేల్కొంచేవరకు ఎలువండి ఎలుగెత్తి ఎలువండి మీ లోపలి పరమాత్మ బదులు పలికేవరకు ఎలువండి జీవితంలోనే మరేమున్నది

మోహామత్సర్యం కోరలలో మనుష్యులు ఎల్లా చిక్కుకున్నారో చూడండి గుండెను ద్రవింపచేసే వారి దీనాలాపాలు వినండి ముందుకు నడవండి ముమ్ముందుకే ఓ స్థైర్యవంతులారా శృంఖలాలలో వున్నవాని విడిపించటాని నిరుపేదల దారిద్ర్యభారాన్ని తగ్గించడాని అజ్ఞానుల హృదయాంధకారంలో సుంతైనా వెలుగు ప్రసరింపచేయడాని ముందడుగు వేయండి మనసులేని మేధావులైన రచయితలను కరుణ కొరవడిన వారి వార్తాపత్రికా రచనలను పట్టించుకోకండి మన పేదలం నా సోదరులు వీరతా అనామకులు ఎప్పుడూ మహోన్నత వ్యక్తులకు వీరే ఉపకరణములు ప్రపంచంలోని మహత్తర బ్రహ్మాండమైన కార్యక్రమా లన్నిటినీ పేదవారే నిర్వర్తించారు ధనికులనబడే వారిని నమ్మకండి వారు మృతజీవులతో సమానం సాధువులు నిరుపేదలు విశ్వాసవంతులైన మీ పైననే ఆశ ఉన్నది

ఎప్పటి ముందుకే పొండి పేదవారకే నేలకు అణగద్రొక్క బడిన వారంటే ఆమరణాంతం సానుభూతి

చూపండి ఇదే మన దీక్షాసూత్రం సాహస యువకులారా ముందుకు నడవండి భగవంతునిలో విశ్వాసముంచండి సిద్ధాంతాలు లేవు మరేమీ లేవు నికృష్ట జీవుల కోసం తపన చెందండి సాయం కోసం నలువేపులా చూడండి దానంతటదే దొరుకుతుంది నవయువకులారా, యీ పేద వారి కోసం అజ్ఞాన దళితవర్గాలకోసం పోరాటాన్ని మీకు నేను వారసత్వంగా సంక్రమింపచేస్తున్నాను ఓ నవయువకు లారా రోజు రోజుకీ క్రిందికి దిగజారిపోతున్న యీ ముప్పై కోట్లమంది ప్రజల విమోచనోద్యమం కోసం మీ యావ జ్జీవితాన్ని వినియోగించండి మీరు నిజంగా నా బిడ్డలే అయితే దేనికీ భయపడరు ఏ అడ్డంకి వచ్చినా నిలబడరు మీరు సింహపు కొదమలవలె వుంటారు భారతావనిని మేల్కొల్పాలి మనం యావత్ప్రపంచాన్ని మేల్కొల్పాలి మనం

గ్రామగ్రామానికీ తిరుగండి మన జాతికి విశాల విశ్వానికీ మేలు చేయండి ఇతరులకు మోక్షం కొనితేవడం కోసం మీరు నరకానికైనా సరే పొండి మరణమే తథ్య మన్నప్పుడు, రాయి రప్పలవలె కాక వీరులవలె మరణించడం మేలుకాదా! ఇతరులకి సేవచేస్తూ అరిగి అరిగి నశించడం మంచిది త్రుప్పు పట్టి నశించే కంటే

కార్యరంగంలోకి దుమకండి. మీరు భరాయించ లేవంత శక్తి ఉత్పన్నమవుతుంది [illegible]

చిన ఏ చిన్న కార్యమైనా సరే అంతశ్శక్తిని మేల్కొల్పు తుంది ఇతరుల క్షేమం గురించిన కనీస యోచన హృద యంలో సింహశక్తిని నిక్షిప్తం చేస్తుంది - మీరందరంటే నాకు అపారమైన ప్రేమ కానీ మీరందరూ ఇతరుల సేవ లోనే ప్రాణార్పణం చేయాలని నేను కాంక్షిస్తాను - మీరల్లా చేస్తోంటే చూడడం నాకు అమిత సంతోషం

మనస్సులో ఏ తలపూ లేకుండా, ధనాపేక్ష, కీర్తి కాంక్ష, మరే యితర ప్రతిఫలాపేక్షా లేకుండా పనిచేసే వ్యక్తి అత్యుత్తమంగా పనిచేస్తాడు మనిషి అల్లా చేయ గలిగిననాడు - అత డొక బుద్ధుడవుతాడు అతనిలోనుండి లోకాన్నే మార్చివేయగల రీతిలో కార్యశక్తి బహిర్గత మౌతుంది.

ప్రేమ విజయాన్ని పొందుతుంది మీరు మీ సాటి వారిని ప్రేమిస్తున్నారా? భగవంతుని కోసం అన్వేషిస్తూ ఎక్కడకు పోతారు? కటిక దరిద్రులు కష్టజీవులు - దీనులు, బలహీనులు - వీరందరూ దైవాలే కదూ? వారిని ముందుగా ఎందుకు పూజించరు? గంగా తీరాన బావులు త్రవ్వడానికి ఎందుకు పోవడం! ప్రేమకున్న అనంతశక్తిలో విశ్వాస ముంచండి

పరమాత్ముని కొరకు సేవచేసే మహదవకాశం కల్గిన మనందరం ధన్యులం, - ఆయనకు మనం సాయం చేయడం - లేదు సహాయం - అనే మాటను మీరు మనస్సులోనుండి

తొలగించండి మీరు ఎవ్వరికీ సాయం చేయులేరు అది దైవ ధూషణతో సమానం అదొక ఆరాధనగా నిర్వర్తించండి. పేదలలో పరమాత్మను దర్శించగలగాలి, నేను - నా మోక్ష ప్రాప్తికోసమే నేను వెళ్ళి వారిని ఆరాధిస్తున్నాను పేదలు, దీనులు మన మోక్షసంప్రాప్తి కొరకే వున్నారు; రోగగ్రస్తుల రూపంలోను మతి భ్రమణం చెందినవారి రూపంలోను, పాపుల కుష్ఠువుల రూపంలోను ఏతెంచే భగవంతుని మనం ఆరాధించగలగాలి

నిన్ను నీవు మరచి పో, నీవు ఆస్తికుడవైనా, నాస్తికుడవైనా నేర్చుకోవలసిన ప్రథమ పాఠం యిదే

ఆనందం పొందవలెనను కాంక్షను సమాజం కోసం సంపూర్ణంగా విడచి పెట్టిననాడు నీవే బద్ధుడవు కాగలవు, నీవు విముక్తుడవు కాగలవు

దారి చూపమో దయాజ్యోతీ " అని మనం ప్రార్థించాలి అంధకారంలోనుండి ఒక తేజోకిరణం ప్రకాశిస్తుంది దారిలో నడిపే దివ్యహస్తం చాచబడుతుంది దారిద్ర్యం, మంత్ర విధులు, నియంతృత్వాలచేత గట్టిగ బంధింపబడిన లక్షలాది పతిత భారతీయుల కొరకు రాత్రింబవళ్ళు మనలోని ప్రతి ఒక్కరూ ప్రార్థనలు చేద్దాం, ధనవంతులకు అగ్రవర్ణుల వారికంటే కూడా, వీరికి మతబోధన చేయటంలో నేను ఎక్కువ శ్రద్ధ చూపుతాను. నేను తత్త్వ విచారకుడనుగాను, వేదాంతిని కాను సన్యాసిని కూడా కాను కాని నేను ఒక

పేదను. కాన నేను నిరుపేదలను ప్రేమిస్తాను శాశ్వతంగా దారిద్ర్యంలో అజ్ఞానంలో క్రుంగిపోయిన ఇరవై కోట్లమంది స్త్రీ పురుషులకోసం ఎవరు బాధపడుతారు? నిరుపేదలకోసం ఎవరి హృదయమైతే రక్తాశ్రువులను కారుస్తుందో అతడినే నేను మహాత్ముడంటాను. వారి కోసం ఎవరు బాధపడుతారు? వీరే మీ దైవం కానివ్వండి. వారిని గురించే యోచించండి వారి కొరకు కృషిచేయండి నిర్విరామంగా వారి కొరకు ప్రార్థనలు చేయండి. దైవం మీకు దారిచూపుతాడు

మహాకార్యసాధనకు మూడు ముఖ్యమైన అంశములు అవసరం. మొట్టమొదట గుండెలోతులనుండి వేదన చెందండి మీరు బాధపడుతారా? దేవతలకు తపోధనులకు వారసులైన తద్వంశీయులు లక్షలాదిమంది పశుప్రాయులై పోయినారన్న భావం మీలో కలుగుతున్నదా? లక్షలాది ప్రజలు ఈనాడు పస్తులుంటున్నారనీ యుగయుగాలుగా వారు పస్తులే వుంటున్నారనీ నీకు తోస్తున్నదా? ఇది నీలో అశాంతిని రేపుతున్నదా? ఇది నీకు నిద్రపట్టనీకుండా బాధిస్తున్నదా? అది నీ రక్తంలోకి, నరాలలోకి ప్రాకిపోయి, హృదయ స్పందనలో ఐక్యమైపోయినదా? నీ మనస్సును ఉన్మాదస్థితిలోకి తీసికొని పోయినదా? వినాశ దుఃఖమనే ఒక్క యోచనతోనే నిండిపోయి, నీ పేరు, ప్రతిష్ఠా భార్యాబిడ్డలూ, ఆస్తిపాస్తులూ, చివరకు నీ దేహంతోసహా ప్రతి ఒక్కటి మర్చిపోయినావా? నీవా పనిచేసినావా? దేశ

భక్తుడవు కావడానికి అదే తొలి అడుగు. మొట్టమొదటి అడుగు. పేద ప్రజల బాధలను నివృత్తి చేయడానికి ఏదైనా ఆచరణీయమైన పరిష్కారం కనుగొన్నావా? వారిని నిందించకుండా ఏదైనా సాయం చేయబోతున్నావా? వారి బాధోపశమనానికి తియ్యని మాటలు ఏవైనా కనుగొన్నావా? ఈ జీవన్మరణం నుండి బయటపడవేసే పద్ధతి తెలిసికొన్నావా? ఇంత మాత్రం చాలదు. మేరువంత ఎత్తైన అడ్డంకులను అధిగమించే సంకల్పబలం వున్నదా? చేత కత్తిబూని యావత్ప్రపంచం నీకెదురు నిలబడినప్పటికీ నీవు మంచిదని తోచిన పని చేయడానికి సాహసిస్తావా? ఇంకా ముందడుగు వేస్తూ, ఆశయ కృషిని నిలకడగా కొనసాగిస్తూ నీ ధ్యేయం వేపు పయనిస్తావా? నీలో అంతటి నిశ్చలబుద్ధి వున్నదా? ఈ మూడు అంశాలూ నీలో వున్నట్లయితే అద్భుతాలు సాధించగలవు.

అబ్బాయిలూ, యీ పథకానికి రూపు దిద్దండి. ఈ భావానికి స్వరూపం యివ్వండి. రథచక్రానికి మీ భుజాలానించి నడవండి. పేరు, ప్రతిష్ఠవంటి వ్యర్థ విషయాల కోసం వెనక్కు తిరిగి చూడకండి! ముందుకు దుమికి, పని ఆరంభించండి.

మున్ముందుకే నడవండి. అంతులేని శక్తి, అంతేలేని వెర్రి ఉత్సాహం, అసమాన సాహసం, అనంతమైన సహనం కావాలి. అప్పుడు మహత్తర విషయాలు సాధించడానికి వీలవుతుంది.

ఇనుప కండరాలు, ఉక్కు నరాలు కావాలి నాకు. వాటిల్లో పిడుగులాంటి గట్టి పదార్థంతో తయారైన మనస్సు ఉండాలి. క్షాత్రవీర్యం, బ్రహ్మతేజస్సు కలబోసిన మానవ శక్తి, మగటిమి కావాలి.

విధేయత అనే సుగుణం అలవర్చుకోండి. కానీ మీ స్వంత నమ్మకాలను త్యాగం చేయకండి. పైనున్న వారిపట్ల విధేయత వుంటేనే కానీ, కేంద్రీకరణ సాధ్యం కాదు. వ్యక్తిగత శక్తులన్నిటినీ కేంద్రీకరింపచేస్తేనే కానీ, గొప్పకార్యం ఏదీ సాధించలేము

అసత్యమైన ప్రతి అంశాన్ని గురించి జాగరూకులై వుండండి. సత్యాన్నే అంటిపెట్టుకొని వుండండి. మనం విజయం సాధిస్తాం. ఆలస్యం కావచ్చును కానీ అవశ్యం సాధిస్తాం. యావత్కార్యమూ మీ ఒక్కరిమీదనే ఆధారపడివున్నట్లుగా ప్రతి ఒక్కరు పాటుపడండి.

నీతిగా, ధైర్యంగా వుండండి. దయాంతఃకరణం కలిగి వుండండి. నిశ్చిత్తమైన నీతితో, అన్నిటికీ తెగించిన ధైర్యంతో నిలబడండి. మత సిద్ధాంతాలను గురించి బుర్ర పాడుచేసికోకండి. పిరికివారే పాపాలు చేస్తారు. సాహసవంతులు తప్పు చేయరు. మనస్సులో కూడా పాపాన్ని తలచరు.

మరో రెండు విషయాలను గురించి జాగ్రత్తపడండి. ఆత్మవిశ్వాసాన్ని పెంచుకోండి.

ముందు పురుషుల్ని తయారు చేయండి పౌరుష వంతులు కావాలి కానీ శ్రద్ధ లేనిదీ వారెల్లా తయారవుతారు?

లేవండి నిద్ర మేల్కొనండి జాగృతం కండి యితరులను జాగరూకులను చేయండి మీరు గతించి పోయేలోగా జీవన పరిపూర్ణత్వాన్ని సాధించండి లేచి మేల్కొంచి గమ్యం చేరుకొనేవరకు నిలచి పోకండి

# ఐదవ అధ్యాయం

# భారతదేశ భవితవ్యం

ఈ దేశం సమసిపోతుందా? అప్పుడు ప్రపంచంలోని ఆత్మజ్ఞానం అంతరించిపోతుంది. విశిష్ట నైతిక వర్తనం అంతరించిపోతుంది. మతం పట్ల వున్న మధుర హృదయగత సానుభూతి అంతరించిపోతుంది. ఆదర్శవాదమే అంతర్ధానమౌతుంది. వీటి స్థానంలో కామం, సుఖభోగాలు అనే రెండు దేవతలు, స్త్రీ పురుష దైవాలుగా రాజ్యమేలుతాయి. వారికి ధనం పూజారిత్వం నిర్వహిస్తే మోసం, దగా, నిర్బంధం, స్పర్థ అనేవి నిత్య పూజాదికాలవుతాయి. మానవుని ఆత్మ బలిపీఠ మెక్కుతుంది. ఇల్లా జరగడానికి వీల్లేదు.

మరొకసారి చక్రం ఊర్ధ్వగతిలో వున్నది. భారతదేశంనుండి చలన తరంగాలు వెలువడ్డాయి - అవి భూమి సుదూరపుటంచుల వరకు అనతికాలంలోనే చేరుకొని తీరుతాయి. నిరుపేదలను సామాన్య ప్రజలను - సంతోషింపచేయమని ఆజ్ఞ ముందుకు వెళ్ళిందని దైవాజ్ఞ ముందుకెళ్ళిందని నమ్మండి - నమ్మండి భారతదేశం మేల్కొనాలి చి తీరాలి

కండ బలంతో కాదు భారతదేశం లేచేది ఆత్మబలంతో మేల్కొంటుంది విధ్వంస పతాకంతో కాదు శాంతి ప్రేమ పతాకాలతో సన్యాసి దుకూలాలతో విజయం గాంచుతుంది ధనశక్తితో కాదు భిక్షాపాత్రతోనే విజయం పొందుతుంది

మన కృషి మీదనే భావిభారతోదయం ఆధారపడివున్నది భారతమాత వేచియున్నది కాకపోతే ఇప్పుడామె నిద్రలో వున్నది కాబట్టి భవిష్యత్తులో మహోత్కృష్ట దేశంగా రూపు దిద్దవలెనంటే వ్యవస్థను పటిష్ఠం చేయడంలోనూ శక్తిని సమీకరించడంలోనూ సంకల్పాలను సంఘటిత పరచడంలోనూ వున్నది అసలు కీలకం. నా మనోవీధిలో యిప్పటికే అద్భుతమైన ఋగ్వేద సంహిత ఒకటి ప్రభవిస్తోంది సర్వులూ ఏక మనస్కులై వుండండి మీరందరూ ఏకాభిప్రాయంతో మనండి అని ఏక మనస్కులై వుండడంలోనే సంఘం యొక్క రహస్యం వున్నది ఇదే అసలు రహస్యం సంకల్ప బలాలను సమీకృతంచేసి అన్నిటినీ ఒకే కేంద్ర పరిధిలోకి తీసుకొని రావాలి

సోదరులారా అందరం కష్టపడి పనిచేద్దాం ఇది నిద్రకు సమయం కాదు ఆదిలోనే పెద్ద ప్రణాళికలు వేయకండి నిదానంగా ఆరంభించండి కాలిక్రింది భూమి గట్టిదనం చూచుకోండి ఆ తర్వాత అడుగు వేయండి పై పైకి

కూతున్నది కారటం లేచింది యీ తరంగ ఉధృతాన్ని ఏదీ ఆపలేదు

ఈ అవ్యక్త స్థితినుండి జగడాలనుండి బయటపడి, దివ్యమై అపరాజితమై వేదాంత మేధతో ఇస్లాం శరీరంతో ప్రభవిస్తున్న భవిష్యద్భారత దేశం నా మనోనేత్రంలో గోచరమవుతున్నది హిందూ ఇస్లాం మతవిధానాల కూడలి మన యీ మాతృభూమి వేదాంత హృదయం ఇస్లాం శరీరం దీనిమీదే మన అభివృద్ధి ఆధారపడి వున్నది

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనే చతుర్వర్గాలవారు ఒకరి తరువాత ఒకరుగా ప్రపంచాన్ని పరిపాలిస్తారని నేనిదివరకే అన్నాను శూద్రకులం తమ శూద్రత్వ లక్షణాలతో ఉద్గమించే కాలం వస్తుంది ప్రతి దేశంలోని శూద్రులు తమ జన్మగత లక్షణాలతోనే అంటే స్వభావ రీత్యా వైశ్యులో క్షత్రియులో కాకుండగనే శూద్రులుగా వుంటూనే ప్రతి సమాజంలోను సర్వాధిక్యం పొందే కాలం రానున్నది ఈ వినూత్నశక్తి తొలిప్రభాత కాంతులు యిప్పటికప్పుడే పశ్చిమ దేశాలమీద పడుచున్నాయి దృగ్గోచరమౌతున్న యీ విషయ పర్యవసానం గురించి యిప్పటికప్పుడే ఆ దేశాలలోని ఆలోచనాపరులు శక్తికి మీరి యోచిస్తున్నారు సామ్యవాదం అరాచకత్వం శూన్యవాదం మొదలైన అనేక విభాగాలు రాబోయే సామాజిక

సుదీర్ఘనిశి గడచి పోతున్నట్లున్నది తీవ్రంగా నలుపు తుండే యిక్కట్లు అంత మొందుతున్నట్లు కనుపిస్తున్నది శవప్రాయమైన దేహం లేచుచున్నట్లున్నది మనవై పొక పిలుపు వస్తున్నది భూతకాలంలోని అంధకారంలోకి తొంగి చూడడానికి కూడా చరిత్ర సంప్రదాయం భీతిపడే తావు నుండి వినవస్తున్నది ఆ వాణి హిమవన్నగోన్నత విజ్ఞానంలో ప్రేమలో శ్రమలో ప్రతిఫలిస్తున్న మన భారత దేశంనుండి మాతృభూమినుండి వెలువడుతున్నది ఆ లలిత రావం మృదువుగా స్ఫుటంగా పొల్లులేని వాక్కులతో వినవస్తున్న యీ స్వనం నానాటికీ ధ్వనిని పుంజుకొంటున్నది నిద్రితులు మేల్కొంటున్నారు హిమవన్నగ పవనాలవలె యిది నశించిన ఎముకలకు కండరాలకు నవజీవనం కొని తెస్తున్నది నిదురమత్తు వదలిపోతున్నది

దీర్ఘసుషుప్తిలోంచి మన యీ తల్లి భారతి కనులు విప్పుతున్న సంగతి అంధులు మాత్రమే చూడలేరు - మతి వికటించినవారు పెడబుద్ధిగలవారు చూడరు ఆమెను ఎవ్వరూ ఎదుర్కొనజాలరు ఆమె యిక మీదట నిద్రపోదు ఏ బాహ్య శక్తి ఆమెను వెనుకకు గుంజలేదు ఈ బ్రహ్మాండమైన స్వరూపం లేచి నిలబడడానికి ఉద్యమిస్తున్నది

(శ్రీ రామకృష్ణులు అవతరించిన నాడే సత్య స్వర్ణ) యుగారంభం జరిగినది. ఇక మీదట సర్వవిభేదాలకు స్వస్తి

ఈశ్వర ప్రేమలో చండాలుని వరకు గల ప్రతి ఒక్కరికీ భాగమున్నది స్త్రీ పురుషులకు మధ్య బీద గొప్పల మధ్య అక్షరాస్యులు నిరక్షరాస్యుల మధ్య బ్రాహ్మణ చండాలుర మధ్య వున్న విభేదాలనన్నిటినీ కూకటి వ్రేళ్ళతో పెకలించడానికి ఆయన జీవించారు ఆయన శాంతిదూత. హిందూ మహమ్మదీయుల మధ్య హిందూ క్రైస్తవుల మధ్య నుండే వైషమ్యాలన్నీ గతకాలం నాటి సంగతులు విభేద పోరాటాలున్నదంతా మరొక యుగంలో ఈ సత్యయుగంలో శ్రీ రామకృష్ణుని ప్రేమవాహిని ఉప్పెనవలె ముంచెత్తి అందరినీ ఒకటి చేసివైచినది శ్రీ రామకృష్ణులవలె పరిపూర్ణుడైన వ్యక్తి ఎన్నడూ లేడు ఈ సత్యం వెంట మనం పోవాలి అదే సమయంలో ప్రతి ఒక్కరూ శ్రీ రామకృష్ణుని తన జ్యోతిగా తన దైవంగా తన మోక్షదాయిగా గురువుగా ఆదర్శంగా మహావ్యక్తిగా—తన మనస్సుకి నచ్చిన రీతినే చూచుకొనేటట్లు అవకాశం కల్పించాలి

బ్రాహ్మణ్యంలోని విజ్ఞానాన్ని, సైనిక శక్తిలోని సంస్కృతిని వాణిజ్యవర్గంవారి సమాన పంపిణీ లక్షణాన్ని కనిష్ఠవర్గంవారి సర్వసమానత్వ ఆదర్శాన్ని - యీ లక్షణాలన్నిటినీ చెక్కు చెదరకుండా వాటిని దుర్లక్షణాలు లేకుండా ప్రోగుచేసినట్లైతే అదే అత్యుత్తమ స్థితి కాగలదు ఒకే కులం ఒకే వేదం శాంతి శ్రావ్యమైన ఏకస్వరం నెలకొన్న నాడు సత్యయుగమైన స్వర్ణయుగం ఉదయించునని నేను

విశ్వసిస్తున్నాను ఈ సత్యయుగ భావనే భారతదేశాన్ని పునరుజ్జీవింపచేస్తుంది ఇది నమ్మండి మేల్కొనండి యువకులారా ఈ కార్యానికి పూనుకొనండి ప్రాచీన హిందూ తత్త్వం శాశ్వతమగుగాక మీరు మేల్కొనండి మనం తప్పక విజయం సాధిస్తాం

రైతుల కుటీరాలనుండి నాగలి చేతబూని నవ భారతాన్ని ఉద్భవించనివ్వండి - బెస్తవారి గుడిసెలనుండి చెప్పులు కుట్టేవారినుంచి వీధులు వూడ్చేవారినుండి మేల్కొంటుంది నవభారతం ప్రతి చిన్న దుకాణంలో ఫ్యాక్టరీలల్లో అంగళ్ళలో చిన్న బజారులలో నుండి జాగృతి ఉద్దీపిత మౌతుంది కొండ చరియలలో అడవులలో చెట్ల గుబురులలో ప్రభవిస్తుంది వెల్లివిరుస్తుంది యీ నవచైతన్యం భూతకాలంనాటి అస్థిపంజరాలలారా మీ కనుల ముందున్న వారు మీ వారసులే భావి భారతదేశమే - మీరు దాచుకొన్న నిధి నిక్షేప పేటికలను ఆభరణ అంగుళీయకాలను వారి ముందు సాధ్యమైనంత శీఘ్రంగా కుమ్మరించండి మీరు అంతర్ధానమై పోయి కంటికి కనుపించవద్దు చెవులు రిక్కించి వినండి మీరు మాయమైన మరుక్షణం భారత నవాభ్యుదయ నాందీఘోష వింటాను లక్ష మేఘగర్జనల గళమై అది జగత్తులో ప్రతిధ్వనిస్తుంది మార్మ్రోగుతుంది జయజయ గురుదేవ

నవ చైతన్యం పుంజుకొని కని విని ఎరుగని తేజోరాశియై అమర సింహాసనాసీనయైన మన యీ మాతృభూమిని వీక్షించండి లేచి నిద్ర మేల్కొంచి ఆమెను దర్శించండి

# శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణము

| | | |
|---|---|---|
| శ్రీ రామకృష్ణ కథామృతము 1 వ భాగము | 18 | 00 |
| శ్రీ రామకృష్ణ కథామృతము 1 వ భా క్యాలికో | 18 | 00 |
| 2 వ భాగము | 3 | 00 |
| క్యాలికో | 8 | 00 |
| శ్రీ రామకృష్ణ జీవిత చరిత్ర | 0 | 00 |
| క్యాలికో | 4 | 00 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము | 2 | 00 |
| శ్రీ రామకృష్ణోపనిషత్తు | 3 | 75 |
| శ్రీ రామకృష్ణ పరమహంస నీతిశిక్షకథారత్నములు (ముద్రణ) | | |
| గురూపదేశములు | 2 | 00 |
| నా గురుదేవుడు | 1 | 25 |
| శ్రీ రామకృష్ణ దివ్యవాణి | 1 | 50 |
| శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత సంగ్రహము | 0 | 75 |
| ఆ రా తికము మరియు శ్రీ రామనామ సంకీర్తనము ... | 0 | 50 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర | 4 | 00 |
| శ్రీ శారదాదేవి | 2 | 50 |
| శ్రీ శారదాదేవి ప్రసంగములు | 8 | 50 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము | 0 | 80 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర | 4 | 75 |
| బాలల వివేకానందుడు | 2 | 00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణ గ్రంథావళి | | |
| 5 వ సంపుటము | 15 | C0 |
| 8 వ సంపుటము | 6 | 50 |
| 9 వ సంపుటము | 6 | 50 |
| 10 వ సంపుటము | 6 | 50 |

